# FAILURE DESIGN

## (ఓటమి ఏర్పాటు)

**Plan to FAIL. And coin it as a SUCCESS**


రవికిషోర్ మల్లాప్రగడ



వెల : రూ. 75/-

మొదటి ముద్రణ : 2019

డి.టి.పి. : ఈశ్వరాంబ స్టూడియో

# ఫైల్యూర్ డిజైన్

ఫైల్యూర్ డిజైన్... ఈ మాట ఏదో వింతగా లేదూ! కమల్ హాసన్ దశావతారం సినిమాలో దేవుడు లోకాన్ని చాలా కరెక్ట్‌గా డిజైన్ చేసేడు అని చూపెట్టబడింది. దేవుడు సునామీ అనే విధ్వంసాన్ని ఎందుకు సృష్టించాడంటే ప్రాణాంతకమైనన బయోజీవులను నాశనం చేయటం కోసమే! మానవాళిని రక్షించుటకు, సునామీ ద్వారా కొందరిని బలిపెట్టడం తప్పులేదు.

ఇంతకీ మన విషయానికొస్తే, మనందరం ఫైల్యూర్‌ని ఎలా డిజైన్ చేసుకుంటామో అని వివరించడం నా ఉద్దేశం. మన యొక్క ఫైల్యూర్ డిజైన్ తెలుసుకొని మనం పొందే లాభం ఏమిటి? ఎవరైనా ఫైల్యూర్ అవడానికి ప్లాన్ చేసుకుంటారా? చాలా ఆశ్చర్యంగా లేదూ! లేదు. గజిబిజిగా ఉంది.

ఈ పుస్తకంలో ఇచ్చే అయిదారు ఉదాహరణలను చదివి అర్థం చేసుకుని, దాని బట్టి ఎవరికి వారు తమ ప్రవర్తనను అంచానా వేసుకోవాలి. తమ జీవితాల్లో జరిగే అపజయాలు తమకి తాము డిజైన్ చేసుకున్నవా లేక వాస్తవంగా జరిగాయా అన్నది అంచనా వేసుకోవాలి. ఎవరైతే తమ జీవితాల్లోని అపజయాలను నూరు శాతం నిజాయితీతో అర్థం చేసుకుంటారో వారి జీవితం సాఫీగా, ఆనందహేలగా, అనారోగ్యాలు లేకుండా ఉంటుంది. చుట్టూ ఉన్న వారికి, వీరి జీవితాలు చూడముచ్చటగా, అసూయగా ఉంటాయి. లేకపోతే బి.పి., షుగర్‌లు శంఖు, చక్రాల్లాగ మోస్తూ బ్రతకాలి.

# ఫైల్యూర్ డిజైన్

ఫైల్యూర్ లేదా అపజయానికి వ్యతిరేకమే విజయం లేదా సక్సెస్. సాధారంగా మనం ఏదైనా సాధిస్తే విజయంగా ప్రకటించుకుంటాం. అది ఎవరికి విజయం? నువ్వు ఏదైనా సాధిస్తే నీకు మాత్రమే విజయం. నాకు ఎలా విజయం అవుతుంది? కాబట్టి దాన్ని వ్యక్తిగత ఎదుగుదల (Individual Development) అని అంటారు. మరి సంపూర్ణ విజయం లేదా? ఉంది. ప్లేగు వ్యాధికి మందు కనుకున్న సైంటిస్టు యొక్క విజయం మొత్తం మానవాళిది. ఇంటర్నెట్ కనుకున్న వ్యక్తి యొక్క విజయం మానవాళిది. ఇటువంటి విజయాలని సంపూర్ణ విజయం లేదా విజయం అని అందాం. 99 శాతం ప్రజల జీవనం సాదా, సీదా జీవనం. వారి వ్యక్తి గత గమ్యాలు, వాటిని సాధించడానికి సల్పిన కృషి – విజయాలుగా ఎలా పేర్కొంటాం. వారి జీవితాలు మార్పు చెందడానికి, ఉన్నతం కావడానికి చేసిన ప్రయత్నాల యొక్క సత్ఫలితాలు. అంతేగాని అవి విజయాలుగా పేర్కొనలేం.

నేను డబ్బు సంపాదించడం, నేను ఇల్లు కట్టుకోవడం, నేను కారు కొనుక్కోవడం, నేను ప్రమోషన్ సంపాదించడం, నాకు మాత్రమే విజయాలు. ఇవి కూడా నేల బారు గమ్యాలే! జీవితాన్ని సుసంపన్నం చేసుకోవాలంటే, నిత్య నూతనంగా ఉండాలంటే కాలాన్ని అధిగమిస్తూ గడపాలి. అంటే కాలాన్ని తెలియకుండా గడపాలి. అంటే కాలక్షేపం అని కొందరు వక్రం చెబుతారు. కానీ అది నిజం కాదు. ఓ వారం రోజులు కాలక్షేపంగా ఏ పని చేయకుండా టీవీ చూస్తూ గడపండి.

చూద్దాం! చాలా టెన్షన్, నిస్సహాయత, చిరాకు వచ్చేస్తాయి. ఎనిమిదో రోజున పనిలో పడితే ముందు కాలక్షేపం చేసిన వారం రోజులూ చాలా బాగున్నాయని అనిపిస్తాయి. అంత మాత్రానా కాలక్షేపం హాయి కాదు. ఇంతకీ మనం చెప్పేదేమిటంటే కాలాన్ని అధికమిస్తూ గడపాలి. అంటే కాలాన్ని తెలియకుండా గడపాలి.

## విద్యార్థి

ఓ టెన్త్ క్లాస్ కుర్రాడు చాలా బాగా చదువుతాడనుకుందాం. రాముడు మంచి బాలుడన్న మాట. రాముడికి పదవతరగతిలో తొంబైఅయిదు శాతం పైగా మార్కులు వచ్చాయ్. దానికి తోడు రాముడిని ఇంటర్‌లో కార్పొరేట్ కాలేజీ వాళ్ళు తన్నుకొని పోయి, ఐ.ఐ.టి. కోచింగ్‌లో పడేశారు. ప్రొద్దున ఎనిమిది నుండి రాత్రి ఎనిమిది వరకు కోచింగ్. సుమారుగా తిండి, నిద్ర అంతా కాలేజీలోనే. టెన్త్ వరకు ఆడుతూ పాడుతూ చదివిన రాముకి ఇంటర్‌లో అంత వర్క్ మొదట్లో ఎక్సైటింగ్ గా ఉన్నా, పోను పోను విసుగు కలిగిస్తోంది. ఆ విసుగు నడుము నొప్పిగా మారింది. దానితో అప్పుడప్పుడు కాలేజి మానేసేవాడు. ఈలోగా ఇంటర్ మొదటి సంవత్సరం పూర్తయ్యింది. ఎప్పటిలాగే రాముకి తొంబైఅయిదు శాతం వచ్చింది. కార్పొరేట్ కాలేజీ వాళ్ళు రాముని మరింత తోమడం మొదలు పెట్టారు. నువ్వే నెంబర్‌వన్ అని అన్నారు. ఐ.ఐ.టి. రుచి ఐ.ఐ.టి.దే నని అన్నారు. రాము డాక్టర్ దగ్గరకు వెళ్ళాడు. ఎక్స్‌రేలు తరువాత ఏమీ లేదని తేల్చారు. కొంచెం

రెస్ట్ తీసుకుంటే అన్ని సర్దుకుంటాయి అన్నారు. కాని రెస్ట్ ఎలా కుదురుతుంది. కార్పొరేట్ కాలేజీ వాళ్ళు ఒప్పుకోరుకదా! మిగిలిన విద్యార్థులు కూర్చోవటం లేదా! వారికి లేని నొప్పి రాముకి ఎక్కడిదని ప్రశ్నించారు? ఒక్క ఆరు నెలలు ఓపిక పడితే ఐ.ఐ.టి. అయిపోతుంది. తరువాత జీవితం ఆటోమేటిక్‌గా(?) పూలపాన్పు అవుతుందని నచ్చచెప్పారు. కాని రాముకి నడుమునొప్పి ఇంకా పెరిగింది. వారమేసి రోజులు కాలేజీ మానేసేవాడు. అవకాశం దొరికితే చదువుకి లీవు పెట్టేవాడు. నడుం నొప్పి తగ్గడానికి ఎక్స్‌ర్‌సైజులు చేసేవాడు. విచిత్రం ఏమిటంటే, కాలేజీ లేని నాడు నడుం నొప్పి అంతగా బాధించేది కాదు. చివరగా రాము ఎనభైశాతంతో ఇంటర్ పాసయ్యి, ఐ.ఐ.టీ ఎంట్రన్స్‌లో ఫెయిల్ అయ్యాడు.

అసలు ఏం జరిగింది? రాము ఆడుతూ పాడుతూ స్కూల్లో పెరిగాడు. ప్రస్తుత పరీక్షా విధానం, మార్కులపోత కారణంగా ఎనభై రావలసిన రాముకి టెన్త్‌లో తొంభై ఐదు శాతం వచ్చింది. దాంతో రాము తనకి తాను తెలివైన వాడుగా భ్రమ పడ్డాడు. అదీకాక, సొసైటీ కూడా తెలివైనవాడుగా గుర్తించింది. ప్రతి మ్యాచ్‌లోనూ సచిన్ సెంచరీ కొట్టాలని ఎదురు చూసినట్టు, రాము ఎటు అడుగు వేసినా, ఎలా చదువుతున్నావ్, ఐ.ఐ.టి. వస్తుందా? వాడికి వచ్చింది, వీడికి వచ్చింది. ఇలా రాముని ఆందోళనకు గురి చేసింది. ఏదో సాధించకపోతే నువ్వు మనిషివి కావు, వెధవ్వి అనే అర్థం వచ్చేటట్లు సొసైటీ డిమాండ్ చేసింది.

ఒకవేళ రాముని ఎవరైనా మాష్టార్ దగ్గరకి తీసుకొని వెళ్ళి అతని సత్తా ఎంతని అంచనా వేయమంటే తప్పనిసరిగా ఆ మాష్టారూ రాముని అత్యంత తెలివైన వాడుగా పరిగణిస్తాడు. ఎందుకంటే ఆ మాష్టారు కూడా సొసైటీలో భాగమే కదా! సొసైటీలో నిర్భాగ్యుడైన రాము, తనని తాను ఎక్కువగా అంచనా వేసుకున్నాడు. అది అతని తప్పు కాకపోవచ్చు. కాని అంచనాలకనుగుణంగా రాము తన శ్రమని పెంచుకోవాలి. పెంచిన శ్రమని ఎంజాయ్ చెయ్యాలి. అటువంటప్పుడే ఈ కార్పొరేట్ శ్రమని తట్టుగోగలడు. కార్పొరేట్ శ్రమ అంటే 8 నుంచి 8 వరకు.

కాబట్టి రాము ఫైల్యూర్‌ను తనకి తెలియకుండానే డిజైన్ చేసుకున్నాడు. టెన్త్‌లో తన సత్తా ఎనభై శాతం. కాని యథాలాపంగా చదివిన వాడికి తొంభై అయిదు శాతం రావడమేమిటని ప్రశ్నించు కోవాలి? అప్పుడు రాముకి గుర్తువచ్చి ఉండేది. తన టీచర్లకి చాలా విషయాలు తెలియవని, తానే ప్రామ్‌టింగ్ ఇచ్చేవాడినని. తన స్కూలు టీచర్లే అలా ఉంటే రాష్ట్రంలో మిగిలిన స్కూల్ టీచర్లు సుమారుగా అలాగే ఉంటారు కదా! ఎక్కువ మార్కులు వేస్తే, తప్పుకి దొరకం కదా అని టీచర్లు, ఎక్కువ శాతం +ఉత్తీర్ణత కావాలని అధికారులు, మార్కులు పోత కార్యక్రమం చేపట్టారు. ఈ విషయం రాము గ్రహించాలి.

రెండు ఐఐటికి తగ్గ చరుకుదనం, శ్రమ తన దగ్గర లేవని రాము గ్రహించగలగాలి. కార్పొరేట్ కాలేజీ వారికి ఏమి కావాలి?

విద్యను అందివ్వడం, దేశాన్ని ముందుకు తీసుకొని వెళ్ళడం వారి ముఖ్య ఉద్దేశాలు కావు. డబ్బు సంపాదన లేదా బిజినెస్ వారి ఉద్దేశ్యం. అందులో భాగంగా ఎక్కువ మార్కులున్న బంగారాన్ని తీసుకొని మెరుగు పెడితే విద్యార్ధి తళతళ లాడే విద్యార్థిగా వొస్తాడు కదా! ఆ రకంగా రాము కార్పొరేట్ కాలేజీ వాళ్ళ చేత ఎన్నుకోబడ్డాడు. గొర్రె దాటు మనస్థత్వం ఉన్న రాము తన ఇష్టాలకి, అలోచనలకి విలువ యివ్వక ఐఐటీ పోటీలోకి ఉరికేడు.

ఇంతకీ తన ఫైల్యూర్‌ని తానే ఎలా డిజైన్ చేసుకున్నాడు? పై విషయాలేవి రాముకి తెలియవు. ఆలోచించినా తెలిసేవి కావు. తన తెలివి తేటలకి ఐఐటి తెలివితేటలకి మధ్య నున్న తేడా (గ్యాప్‌ని) పూరించలేక, ఓటమిని ఒప్పుకోలేక (అప్పటికే రాము విజేతగా కొనియాడబడుతున్నాడు) రాము యొక్క అంతర మనస్సు ఫైల్యూర్‌ని డిజైన్ చేసుకుంది. తాను నడుము నొప్పి వలన కాలేజికి వెళ్ళలేక ఫెయిల్ అయ్యాను. లేకపోతే అందరూ ఆశించినట్టు ఐఐటి తెచ్చుకునేవాడు అనే పేరుకోసం రాము పాటుపడ్డాడు. అది సక్సెస్‌ఫుల్‌గా నడుమునొప్పి అనే వ్యాధి రూపంలో బయటపడింది. ఈ రకంగా రాము తనకి తెలియకుండా తనని మోసం చేసుకున్నాడు. అలాగే సొసైటీని కూడా నమ్మించాడు. ఇప్పటికైనా రాము గ్రహించవలసిన విషయం ఒకటి ఉంది. ఇంటర్ తరువాత తనకిష్టమైన కోర్సు ఎంచుకొని జాయిన్ అయితే, నడుం నొప్పి ఆటోమేటిక్‌గా

పోతుంది. అలా కాక తన మనస్సు పైనున్న పొరను తొలగించుకోలేక ఇంకా సంఘం నియమించిన గోల్స్ కోసం ప్రయత్నిస్తే ఆ నడుం నొప్పి ఆట్లానే జీవితాంతం ఉంటుంది.

ఐశ్వర్యం – అమెరికా

శ్రీలక్ష్మి చాలా అందంగా ఉంటుంది. అందరితోను అరమరికలు లేకుండా కలివిడిగా మాట్లాడుతుంది. దాని వలన బాయ్స్ వద్దన్న ఆమెకు ఎదోరకంగా సహాయం చేసేవారు. చదువు బలవంతంగా నేర్పేసేవారు. టీచర్ల దగ్గర నుండి కూడా ఆమెకు (అందం వలన) మంచి సపోర్ట్ దొరుకుతుండేది. ఈ సహాయాలు ఆమెకు అయాచితంగా లభ్యం అయ్యాయి. ఇవన్నీ కూడా తన అందం వలన, స్త్రీ అవ్వడం వలన, ప్రయత్నం ఏమీ లేకుండా వచ్చినవని ఆమె గ్రహించలేక పోయింది. తాను పూర్వ జన్మలో చేసిన పుణ్యం(?) వలన ఈ లాభాలు ఈ జన్మలో దొరుకుతున్నాయి అని అనుకునేది. అవి చేజారిపోకూడదని ఆమె పూజా సమయాన్ని కొంచెం పెంచింది. చదువుకునే పిల్ల పూజలు చెయ్యడాన్ని సమాజం హర్షిస్తుంది. ఎంకరేజ్ చేస్తుంది. ఎంకరేజ్ చేయడం అంటే తప్పులు వెతకక పోవడం.

మొత్తానికి శ్రీలక్ష్మి చదువు పూర్తయ్యింది. చదువు అయ్యి అవ్వగానే అద్భుతమైన అమెరికా పెళ్ళికొడుకు, ఈమె అందం, ఉన్నత చదువు చూసి ఫ్లాటయ్యి, కట్నం లేకుండా పెళ్లి చేసుకొని అమెరికా తీసుకొని వెళ్ళిపోయాడు. అంత ఐశ్వర్యం శ్రీలక్ష్మి తన

జీవితంలో ఊహించలేదు. అమెరికా అందాలకి, లగ్జరీ లైఫ్‌కి తట్టుకోలేకపోయింది. శ్రీలక్ష్మి మనస్సు వీటన్నిటిని చేజారిపోకుండా చూసే కార్యక్రమం చేపట్టింది. అంటే తనకి దొరికిన అందలానికి తాను అర్హురాలినని నిరూపించుకోజూసింది. మొదటగా పూజా సమయం పెంచి, చాదస్తం, వారం, వర్జ్యం మొదలుపెట్టింది. అమెరికాలో తెలుగు క్యాలెండరు చూడడం మొదలు పెట్టింది. అంతే! అమెరికాలో మిగిలిన తెలుగువారు శ్రీలక్ష్మికి ఫోన్ చేసి వారం, వర్జ్యం, తిథి అడుగుతుండేవారు. ఈ చాదస్త్రాల వలన భర్త సేవలకి సమయపాలన చేయలేకపోయింది. అమెరికాలో సమయపాలన లేకపోతే ఎలా మరి? భర్త విసుక్కోసాగేడు. పెళ్ళైన కొత్త మోజులో వ్యంగ్య జోకులు వేసినా, రాను రాను అవి విసుర్లుగా మారిపోయాయి. ఓటమి ఎరుగని శ్రీలక్ష్మి, భర్త మీద ఎదురు తిరిగింది. స్త్రీ వాద సిద్ధాంతాలు లేవనెత్తింది. భూమి మీద పని మాత్రమే ఉంటుందని, అడపని, మగపని అనేవి ఎక్కడా లేవని, ముఖ్యంగా అమెరికాలో లేవని, తనకి వంట వండడం, ఇల్లు తుడవడం, కాఫీ కలపడం ఇష్టం లేవని, చదువుకున్నాను కాబట్టి ఉద్యోగం చేసి మిష్టర్ పెళ్ళాం అవతారం ఎత్తగలనని, దమ్ముంటే తన బదులు ఈ ఆడపని నువ్వు చేయగలవా – అని భర్తని నిలదీసింది. ఒకప్పటి తల్లిచాటు బిడ్డ అయిన శ్రీలక్ష్మి భర్త డంగయిపోయాడు.

అయితే శ్రీలక్ష్మికి, తన అర్గ్యుమెంట్ తనకే నచ్చలేదు. ఆమె

మోహం అంతా ఈ అందలం, ఐశ్వర్యం చేజారిపోకూడదని, అలాగే వాటన్నిటికి తాను అర్హురాలినని నిరూపించడమే. శ్రీలక్ష్మి తన ధోరణి మార్చుకుంది. తన సక్సెస్ స్టోరీలు చెప్పడం మొదలుపెట్టింది. తాను ఎంత బాగా చదివేది, పిక్‌నిక్‌లు ఎంతబాగా ఆర్గనైజ్ చేసేది, కల్చరల్ ప్రోగ్రామ్‌లు ఎంత గ్రాండ్‌గా నిర్వహించేదో చెప్పేది. ఈ పనులు చేసేటప్పుడు అందరూ తన కనుకూలంగా ఎలా పని చేసేవారో చెప్పేది. ఇది అంతా తన లీడర్‌షిప్ క్వాలిటీస్ అని నొక్కి వక్కాణించేది. శ్రీలక్ష్మి ఇలా చెబుతుండేది కానీ, ఎక్కడో మారుమూల మనస్సులో చిన్న అశాంతి చోటుచేసుకుంటుండేది. ఆ అశాంతిని శ్రీలక్ష్మి గ్రహించుకోలేక పోయింది. పైగా భర్త తన పట్ల శ్రద్ధ, ఆశక్తి కనపరుచుట తగ్గడం వలన ఈ అశాంతి వస్తోందని నచ్చచెప్పుకుంది. ఇప్పుడు శ్రీలక్ష్మికి తెలియని సమస్యలు రెండు. ఒకటి ఇప్పటి వరకు అయాచితంగా లభ్యమైన సక్సెస్ చేజారిపోతుందేమొనన్న అభద్రతా భావన, రెండు భర్త యొక్క మెప్పు పొందడం.

సరిగ్గా ఈ సమయంలోనే శ్రీలక్ష్మి డెలివరీకి ఇండియా రావడం, తదుపరి శ్రీలక్ష్మి తమ్ముడు ఏక్సిడెంట్‌లో పోవడం జరిగాయి. శ్రీలక్ష్మి ఇంటికి పెద్ద దిక్కు అయ్యింది. పిల్ల తల్లి అయిన శ్రీలక్ష్మి లావెక్కి, అందాలు తగ్గి, అట్రాక్షన్ కొంచెం కోల్పోయింది. ఇంటి పెద్దగా చేసే పనులలో సొసైటీ నుంచి మునుపటి సహాయ సహకారాలు అందలేదు. నిస్సహాయమయిన మనస్సు చక్కటి కారణం డిజైన్ చేసింది. తమ్ముడి మరణం, ఇంటి పెద్ద అవ్వడం వగైరా కారణాలు వలన సడెన్ షాక్‌కి

గురైన శ్రీలక్ష్మికి రుమాటిక్ ఆర్థరైటిస్ వచ్చింది. ఈ వ్యాధి లక్షణాలు విపరీతమైన కీళ్ళ నొప్పులు, గట్టిగా మేడ ఎక్కలేకపోవడం, అన్నం గిన్నె దించలేకపోవడం, చిన్న సూట్‌కేసు కూడా మోయ లేకపోవడం, కొంచెం శ్రమకే ఆయాసం మొదలైనవి.

ఇంటర్‌నెట్‌లో వెతగ్గా వెతగ్గా ఎక్కడో నాలాంటి డాక్టరు సడెన్ షాక్ వల్ల ఇటువంటి కీళ్ళ నొప్పులు రావచ్చని రాసేడు. అంతే! శ్రీలక్ష్మి అది అదనుగా తీసుకొని ఆ విషయమే ప్రచారం చేయడం మొదలు పెట్టింది. పెద్ద దిక్కు అయిన శ్రీలక్ష్మి తల్లిని, చిన్న తమ్ముడిని తన అమెరికా డబ్బు ద్వారా చూసుకోసాగింది. వారికి ఈమెను సమర్థించడం తప్ప గత్యంతరం లేదు. ఆ రకంగా సొసైటీలో (చుట్టూ ఉన్న వాతావరణంలో) పావులు కదిపి, అందరిని తనకుకూలంగా మార్చుకోగలిగింది. తనకు అనుకూలమంటే అందరూ శ్రీలక్ష్మి వ్యాధి నిస్సహాయతను సమర్థించడం. ఈ రకంగా శ్రీలక్ష్మి 30 సంవత్సరాలకి దీర్ఘకాల వ్యాదులైన బీపీ, కీళ్ళ నొప్పులు, ఆయాసం మొదలగు వాటితో బాధపడుతోంది. చుట్టూఉన్నవారు ఈ విషయం మరచిపోకుండా, శ్రీలక్ష్మి నెలకొకసారి డాక్టరుని సందర్శించి వస్తుండేది. అమెరికా వెళ్ళాక కూడా శ్రీలక్ష్మి రోగాలు భర్త భరించక తప్పలేదు. ఈ రకంగా ఆమె భర్త చిరాకు పడే అవకాశం కూడా కోల్పోయాడు.

శ్రీలక్ష్మి మొదటి నుంచి తన వ్యక్తిత్వాన్ని తప్పుగా అంచనా వేసుకుంది. తన వ్యక్తిత్వం వలన కాకుండా, అందం వొంపుసొంపుల వలన అందరూ సహాయం చేయడానికి ముందుకు ఉరుకుతున్నారన్న

విషయం అర్థం చేసుకోలేదు. ఎవరైనా తనని ప్రేమిస్తున్నారని లేఖలు రాసినా, భావాన్ని వ్యక్తం చేసినా, వారిని ఛీ కొట్టడం ద్వారా తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటున్నానని అనుకుంది. ఈ రకంగా శ్రీలక్ష్మి అప్పుటికి అనుకూలమైన నిర్ణయాలు తీసుకొని అవే తన వ్యక్తిత్వ మార్గ దర్శకాలు అని అనుకొంది. సరియైన ఆత్మ విమర్శ చేసుకోలేదు. నాలో ఏం చూసి పెళ్ళి చేసుకుంటాడు అని ఆలోచించకుండా నన్ను ఎవరైనా ఇట్టే పెళ్ళి చేసుకుంటారని తనకి తెలియకుండా తానే విర్రవీగింది. గతంలో తనకి ఎదురైనా పూర్తి విజయల వలన (?) ఆమెకు ఇటువంటి ఆలోచన దోరణి వచ్చింది. ఇదంతా తన కాన్ఫిడెన్స్ అని అనుకుంది.

తన మీదకు రాళ్లు రువ్వుతుంటే ఆ రాళ్లను క్యాచ్ పట్టి ఇల్లు కట్టుకోవడం వ్యక్తిత్వ వికాస సూక్తి. అలాగే జీవితంలో ఎదురైన చేదు విషయాలకి (అపజయాలు కాదు) తలొగ్గి, తరువాత సంబాలించుకొని నవ్వుతూ ముందుకు సాగాలి. అలా కాకుండా ఎప్పటికీ తనకి ఎదురు ఉండకూడదని శ్రీలక్ష్మి లాగ అలోచిస్తూ ఉంటే ఇలాగే లేనిపోని రోగాలు బయట పడతాయి. మీరు జాగ్రత్తగా గమనించండి మన చూట్టూ ఉన్న చాలా మంది ఈ రకంగానే దీర్ఘవ్యాదులతో బాధ పడుతూ, అవి నిజమని నిరూపించటానికి రకరకాల మార్గల ద్వారా ఆరాటపడుతుంటారు. ఖరీదైన డాక్టర్ల దగ్గర క్యూలు కట్టే చాలా మందికి నా ఉద్దేశ్యంలో అసలు రోగాలే లేవు. అసలు ఆ డాక్టర్లు ఖరీదవ్వడానికి ఇటువంటి పేషంట్లే కారణం.

# ఫెయిల్యూర్ డిజైన్

ఏమీ తెలియని వయస్సులో పోలియో వచ్చిన దానికి, కాలక్రమేణా పోలియో సంతరించుకోవడానికి చాలా తేడా వుంది.

అయితే ప్రస్తుతం శ్రీలక్ష్మి ఏం చెయ్యాలి? ముందుగా ఆమె తనని తాను అసహ్యించుకోవాలి. వ్యాధులు లేని శ్రీలక్ష్మి గా గుర్తింపు తెచ్చుకుంటానని తనకి తాను శపథం చేసుకోవాలి. ముగ్గురు నలుగురు కౌన్సిలర్లు లేదా ఫ్రెండ్స్ దగ్గరకి వెళ్ళి తనని మనస్ఫూర్తిగా విమర్శించమని కోరాలి. ఆ విమర్శలకి గడబిడ పడకుండా వాటిలోని నిజాలని నిగ్గ తేల్చుకొని వాటికి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించాలి. గతంలో తనకి వచ్చిన సక్సెస్ ఎంతవరకు నిజమయినదో కరెక్ట్‌గా అంచనా వేసుకోవాలి. ఎప్పటికప్పుడు సరియైన విధంగా ఆత్మవిమర్శ చేసుకుంటూ ఉండాలి. ఎవరైనా అయ్యయ్యో అని అంటూ ఉంటే (తల్లైనా కావచ్చు) వారు నిజంగా అంటున్నారా లేక వారి లాభం కోసం అంటున్నారా లేక తన సానుభూతి పొందడానికి అంటున్నారా అని గ్రహించుకోగలగాలి. తాను గతంలో అబద్ధాలు ఆడేనా లేదా అని తొంగి చూసుకోవాలి. ప్రతి భావంతుడైన డాక్టర్ సంప్రదింపుతో తగ్గించిన మందులు వాడుతూ, వ్యాధులకు తలొగ్గక, వ్యతిరేకంగా పోరాడుతూ నెగ్గుకు రావాలి. ఇది మొదట్లో చాలా కష్టమైనా, కఠిన శ్రమతో ప్రయత్నిస్తే ఓ నాలుగు సంవత్సరాలకి కొలిక్కి రావచ్చు. అప్పుడు శ్రీలక్ష్మి సార్ధక నామధేయురాలు అవుతుంది.

ఇక్కడ మనం ఇలా వ్యాధులకి వ్యతిరేకంగా పోరాడిన వాళ్ళపేర్లు ఒక్కసారి గుర్తు తెచ్చుకుందాం.

# ఫైల్యూర్ డిసైన్

BKS Iyengar : ఆధునిక ప్రపంచానికి యోగా ప్రాముఖ్యతను ఆచరించి, వివరించి చూపిన ఈ శతాబ్ధపు పతంజలి అయ్యంగార్ (1918–2014).



పదహారు సంవత్సరాలప్పుడు ఆయనకు టీ.బి., టైఫాయిడ్ మలేరియా సోకింది(1934). వీటితో ఆయనింక బ్రతకలేడని తేల్చేసారు. అప్పుడు ఆరంభించిన యోగా ఆయన ఈనాటికీ వదలలేదు. యోగా దెబ్బతో వ్యాదులన్నీ పారిపోయాయి. ఆయనకు భారత ప్రభుత్వం పద్మశ్రీ, పద్మవిభూషణ్ మొదలగు చాలా బిరుదులతో సత్కరించింది. ప్రఖ్యాత తత్వవేత్త జిడ్డు కృష్ణ మూర్తి ఆయన దగ్గరే యోగా నేర్చుకున్నారు.

John Nash (1928–2015): అభయ్ సినిమాలో కమల్‌హసన్‌కి ఉన్న వ్యాది పేరు Schzophernia with Paranoid, స్కిజోఫెర్నియా (చాలా



రకాలు) ఉన్నవారికి బయటి నుండి మాటలు వినబడుతూ ఉంటాయి. సాధారణంగా ఈ స్కిజోఫెర్నియా సమసిపోదు. మందులతో చాలా బాగా కంట్రోల్ చేయవచ్చు, జాన్ నాష్ సమసిపోనటువంటి వాధితో పోరాడి, వాధిని నేలమట్టంచేసి ఎకనామిక్స్‌లో నోబుల్ ప్రైజ్ సంపాదించేడు. తద్వారా అసంభవం అనే మాటను చెరిపేసాడు. జాన్ నాష్ మీద తీసిన సినిమా పేరు A Beautiful Mind అవకాశం ఉంటే చూడండి.

# ఫైల్యూర్ డిజైన్

Stephen Hawking (1942-2018) : ఈయన గురించి తెలియని వారు



ఉండరు. 21 సంవత్సరాలప్పుడు Motor Neuron Disease వచ్చింది. అప్పటి నుంచి తనంతట తాను ఏపని చేసుకోలేడు, కదలలేడు, మాట్లాడలేడు, భోజనం కూడా సరిగ్గా చేయలేడు. అన్ని వసతులు ఉండి, అన్ని సరిగ్గా ఉంటేనే మనం చదువుకోలేం. కానీ హాకింగ్స్ – న్యూటన్ కుర్చీని అధిరోహించి ఐన్‌స్టీన్ తరువాత అంతటి మేధావి అయ్యాడు. భయంకరమైన శరీర వైకల్యం అతనికి అడ్డురాలేదు.

Lawrence Raghavendra (1976) : ఒక బాలుడికి చిన్నప్పుడే శరీరం



మొత్తం కుడివైపున పోలియో లాంటి వ్యాధి వచ్చి చచ్చుపడిపోయింది. రాఘవేంద్ర స్వామిని కొలిస్తే 12వ ఏటన బాగుపడింది. అప్పటినుండి అతని పేరు లారెన్స్ రాఘవేంద్ర. ఏదైతే అతని శరీరానికి వ్యతిరేకమో దానినే (డాన్స్‌నే) అతను వృత్తిగా స్వీకరించేడు. అతనిలోని మానవ ఆత్మ ఆ పనికి పురిగొల్పింది. ఇంకా అద్భుతమేమిటంటే లారెన్స్ ఎక్కడా డాన్స్ నేర్చుకోలేదు. అలౌకిక వ్యక్తి అయినందున ఆయన 50% ఆదాయాన్ని అనాధలకు పంచుతాడు. కలాం ట్రస్ట్‌కి కోటి రూపాయలు దానం చేసేడు.

Amitabh Bachchan(1942) : ఈయన సినీ జీవితం 50 సంవత్సరాల



పై మాటే. ఈ క్రమంలో అమితాబ్ చాలా సార్లు వ్యాధిగ్రస్తుడయ్యాడు. కూలీ సినిమా షూటింగ్‌లో చాతీకి చాలా పెద్ద దెబ్బ తగిలింది. అమితాబ్ అయిపోయాడనుకున్నప్పుడు మళ్ళీ పైకి లేచేవాడు. అలా పడుతూ లేస్తున్నప్పుడు, ఒక స్టేజిలో సుమారుగా డబ్బంతా పోయినా 'అల'లాగ పైకి లేచి బిగ్–బి అయ్యాడు. తనకున్న వ్యాధుల వలన గాని సమస్యల వలన గాని ఎప్పుడు వెనకడుగు వెయ్యలేదు. ఈ మధ్య ఉదరకోశ వ్యాధికి ఆపరేషన్ చేసుకొని తిరుపతి దర్శనానికి వెళ్ళాడు.

Chiranjeevi (1955) : సినిమాల్లో చిరంజీవి పరిగెడు తున్నప్పుడు,



మీరు జాగ్రత్తగా గమనిస్తే ఒక కాలు కొంచెం ప్రక్కగా ఉంటుంది. నర్సాపూర్‌లో చదువుతున్నప్పుడు, ఎన్.సి.సి. నేవీలో పనికి రావనని ప్రక్కన కూర్చోబెట్టేసారు.

ప్రక్కన కూర్చోబెట్టినవారిని, కెప్టన్ పరిశీలిస్తున్నప్పుడు చిరంజీవి తన కాళ్ళు సరిగ్గా ఉన్నట్లు నిలబడ్డాడు. అప్పుడు కెప్టన్, చిరంజీవిని సెలక్ట్ చేశాడు. విపరీతమైన పట్టుదల గల చిరంజీవి, రిపబ్లిక్ డే సెలిబ్రేషన్స్‌కి ఆ కాలేజి తరుపున డిల్లీకి వెళ్ళాడు. ఓ స్టూడెంట్ లెవెల్‌లో ఎన్.సి.సి. లో అంత పైకి రావడం

చాలా గ్రేట్. చాలా సంవత్సరాల తరువాత అదే కాలేజి నుండి ఆర్.డి.సి.కి సెలక్ట్ అయిన వ్యక్తి పేరు గెద్దాడ శ్రీనివాస్. కాలేజీ వాళ్ళ ఆహ్వానం మీద చిరంజీవి వచ్చి శ్రీనివాస్‌ని సత్కరించాడు. ఓటమిని ఒప్పుకోక పోవడం, వైకల్యాన్ని నమ్మక పోవడం చిరంజీవి విజయానికి కారణం. ఒక సందర్భంలో అమితాబ్ 25 లక్షలు తీసుకుంటున్నప్పుడు, చిరంజీవి దేశంలో అత్యంత ఎక్కువ పారితోషకం 40 లక్షలు తీసుకునేవాడు.

ఆఖరుగా నా ఎదుగుదలకి ఫలానా కారణం అడ్డు వచ్చింది, అందుకే ఎదగలేక పోయాను అని చాలా మంది అంటూ వుంటారు. అవి ఎదగకుండా ఉండడానికి చెప్పే కారణాలే కానీ, ఎదుగుదలను ఆపు చేసే కారణాలు కావు. అప్పటి వరకు వచ్చిన సక్సెస్‌తో తృప్తి పడి, ఆ సక్సెస్ వద్దే రిలాక్స్ అవ్వడానికి నిర్ణయించుకున్న బాపతు వ్యక్తులు, ఇలా కారణాలు చెప్పి స్థిమితపడుతూ వుంటారు.



## ఓటమి ఏర్పాటు

మనందరం చాలా సందర్భాలలో ఓటమి ఏర్పాటు చేసుకుంటాం. ఓటమి అంటే ఏదో సాధిద్దామని ప్రయత్నించి ఫలించక కూర్చోవడం కాదు. దానిని సక్సెస్‌గానే చూడాలి. అంటే ప్రయత్నం యొక్క ఫలితంగానే గుర్తించాలి.

ఓ ఇరవై ఏళ్ళ కుర్రాడు తన లెక్చరర్‌ని గాఢంగా ప్రేమిస్తాడు. అతనికి ఒక్కటి మాత్రం చాలా క్లియర్‌గా తెలుసు. తన ప్రేమ నిజమైందని, తాను చేస్తున్నది ఓ ప్రయత్నం మాత్రమేనని. అతనికి ఫలితం మీద పెద్ద మక్కువ లేదు. ఇదే విషయాన్ని హేపీడేస్ సినిమాలో శేఖర్ కమ్ముల హేపీగా చూపెట్టాడు. అలాగే ప్రక్క ఇంటి ఆంటీ కోసం ప్రయత్నించి విఫలమైనవాడు నిస్పృహతో చతికిలబడడు. అటువంటి ప్రయత్నాలు మళ్ళీ చేయకూడదు అనుకొని జ్ఞానోదయం చేసుకోడు. తన ప్రయత్న ఫలితం ఇంతే అని సరి పెట్టుకొని,ఈ సారి ప్రయత్నిస్తే మరింత పట్టుదలతో క్రొత్త మార్గాలతో ప్రయత్నించాలని నిర్ణయించుకుంటాడు. కానీ మనం నిజ జీవితంలో అపజయం రాగానే ఆ ప్రయత్నాలు వొమ్ముచేసి, మార్గం మార్చి క్రొత్త సక్సెస్ కోసం వెతుకుతాం లేదా అపజయం వలన ఆగిపోయానని, అదే నా సకెస్స్ అని నమ్మబలుకుతాం.

ముందుగా మనందరం ఒక్కటి చాలా క్లియర్‌గా తెలుసుకోవాలి. జీవితంలో సక్సెస్ అనేది లేదు. ఓటమి అనేది లేదు. సినిమాలో

హీరో విలన్‌ని చివరకు తుదముట్టిస్తాడు. ప్రేక్షకులు సంతృప్తిగా ఇంటికి వెళ్ళిపోతారు. కానీ జీవితంలో ఇలా జరగదు. ఒక విషయం అయిపోగానే, మరో విషయం రెడీగా ఉంటుంది. సినిమా ఎండ్ అయినట్టు జీవితానికి శుభం కార్డు ఏదీ? కాబట్టి జీవితంలో సక్సెస్ అనేది లేదు. అలాగే ఓటమి అనేదీ లేదు. ప్రయత్నం, ఫలితము ఇవి రెండు మాత్రమే ఉన్నాయి. ఫలితాన్ని ఓటమికో, పరాజయానికో అనుసంధానం చేసి చూడకండి. భగవద్గీత సారాంశాన్ని కరెక్ట్‌గా అర్థం చేసుకోండి. "ఫలితం మీద మనకు అధికారం లేదు".

భగవతికి చాదస్తం ఎక్కువ. పూజా పునస్కారాలు ముగించుకొని, మడిగా వేడి అన్నం తిని ఆఫీస్‌కు బయలుదేరేసరికి – ఎప్పుడూ లేటే. ప్రతి రోజు లేటుగా బయలుదేరి, చిరాకుగా సిటీ బస్సు ఎక్కుతుంది. ఎక్కిందగ్గరనుండి ఈ బస్సుకి ఏక్సిడెంట్ అయ్యి, తనకేమీ కాకపోతే బావుంటుందని దేవుడిని ప్రార్థిస్తుంది. ఈలోగా కండక్టర్ మిగిలిన చిల్లర ఇవ్వకపోతే తారాజువ్వలాగా లేస్తుంది. ఈవెు బస్సు ఎక్కుతోందంటేనే డ్రయివర్, కండక్టర్ వెటకారంగా జోకులు వేసుకుంటూ ఉంటారు. ఆఫీస్‌కి లేటుగా రీచయ్యి కుంటి సాకులు చెబుతుంది. ఈమె సర్వీస్ అంతా ఇట్లానే గడిపింది. 40 సంవత్సరాలకే బీపీతో బాధపడుతోంది. 50 దాటిన దగ్గర నుండి షుగర్ వచ్చింది. చూడండి భగవతి ప్రతి రోజూ ఫైల్యూర్‌కి ఎలా ప్లాన్ చేసేదో? బస్సు ఏక్సిడెంట్ అయిపోవాలని, తన చాదస్తం వొదులుకోలేక, ఏదైనా

ప్రమాదం ఎదురైె తాను మాత్రం సురక్షితమైతే, లేటుగా వచ్చినందుకు బలమైన కారణం చెప్పగలుగుతుంది. ఉదాహరణకు అదే భగవతి మోటార్ సైకిలు మీద ఆఫీసుకు వెళ్తోందనుకోండి. అప్పుడు ఆమె తనకు తెలియకుండా తానే ఏక్సిడెంట్ కల్పించుకుంటుంది. దూరం నుంచి మీరు ఆ ఏక్సిడెంటుని చూస్తే అది సహజంగానే జరిగిందనిపించవచ్చు. కానీ, భగవతి అంతర్ మనస్సులో ప్రమాదం కోరుకుంటోంది. తద్వనుగుణంగా అసహజం లేకుండా ప్రమాదం కల్పించుకుంటుంది. బహుశా అవతలి పార్టీ కూడా ఇదే విధంగా ప్రమాదాన్ని కోరుకొని ఉండవచ్చు.

ప్రమాదం జరిగిన ప్రతిసారి మీకు మీరు గమనించుకుంటే, మీరు అంతర్ మనస్సులో దాన్ని కోరుకుంటూ ఉంటారు. నేను చెప్పేది మీకు హాస్యాస్పదంగా అనిపించవచ్చు. ఉదాహరణకు మీరు ఆఫీస్‌లో సాధారణ ఉద్యోగం చేస్తూ ఉండవచ్చు. కానీ మీరు పార్ట్‌టైమ్ వ్యాపారంలో నెలకు అయిదు లక్షలు సంపాదిస్తున్నారనుకోండి. అప్పుడు రెండు విషయాలు చాలా క్లియర్ కట్‌గా అర్థం అవుతాయి. మొదటిది మీ జీవితం ఎంతటి విలువైయిందో అర్థమవుతుంది. రెండు కాలం యొక్క విలువ కూడా మీకు బాగా అర్థం అవుతుంది. తద్వారా మీరు ఆఫీసుకు లేట్‌గా వెళ్ళడానికి ఇష్టపడరు. కారణం నిజాయితీ కాదు. లేటు అయ్యిం దగ్గరనుండి ఏ కుంటి సాకు ఆఫీస్‌లో చెప్పాలా అని ఆలోచిస్తూ ఉంటారు. మీకు ఖాళీ ఉంటే మీఆలోచనలను పార్ట్‌టైం అయిదు లక్షలను ఎలా పదిలక్షలు చెయ్యాలా అని

ఆలోచిస్తారు. అంతే కానీ అయిదు లక్షలతో పోలిస్తే తక్కువ జీతం వస్తున్న ఉద్యోగానికి ఆలోచనలను కేటాయించరు. అంతకంటే కరెక్ట్ టైంకి రావడానికి అలవాటు చేసుకుంటారే తప్ప, లేకి వేషాలు వెయ్యరు.

మీరు మీ చుట్టూ ఉన్నవారిని ఒక్కసారి గమనించండి. ఎమ్.ఎల్.ఎ. దగ్గరో ఎమ్.పి. దగ్గరో పార్ట్‌టైం అన్‌పెయిడ్‌గా ఉన్న సెక్రటరీ, తాను రెగ్యులర్‌గా చేస్తున్న ఉద్యోగాన్ని చాలా పంక్చువల్‌గా వచ్చి, నిజాయితీతో పని చేస్తూ ఉంటాడు. అన్‌కామెంటబుల్‌గా ఉండడానికి చూస్తాడు. సినిమాల్లో లాగ రౌడీయిజం ఏమీ చెయ్యడు. అంతెందుకు, ఏక్సిడెంట్‌లను గమనించండి. ఎగువ, దిగువ మధ్య తరగతివారికే ఏక్సిడెంట్లు అవుతాయి కానీ, సంపన్నులకి పెద్దగా ఏక్సిడెంట్లు అవ్వవేమి? అలాగే ఆటో డ్రయివర్ తన జీవితానికి ఇన్స్యూరెన్స్ చెయ్యడానికి ఇష్టపడడు, ఒక కోటీశ్వరుడు వెతుక్కుంటూ వెళ్ళి ఇన్స్యూరెన్సు చేస్తాడు. డబ్బు పోతుందేమోనన్న భయంతో కోటీశ్వరుడు ఇన్స్యూరెన్స్ చేయించుకున్నాడని మనం వెక్కిరిస్తాం. కోటీశ్వరుడు మనస్సులో నవ్వుకుంటాడు. ఎందుకంటే జీవితం విలువ మనకంటే అతనికే బాగా తెలుసు. ఇదే జీవితంలో కోట్లు సంపాదించగలిగేడు. ఇన్స్యూరెన్సు విలువ కూడా మన కంటే అతనికే బాగా తెలుసు.

సుమారుగా ప్రతి ఏక్సిడెంట్ ఫైల్యూర్ డిజైనే. తండ్రి కొడుకుని వెటకారంగా తిడతాడు. కొన్నాళ్ళ తరువాత కొడుకు తాళం వేసిన సైకిల్‌ని పోగొట్టుకుంటాడు. తరువాత తండ్రి కొడుకు వీపు చీరేస్తాడు.

నువ్వు సైకిల్ పెట్టిన ఏరియా అంత మంచిది కాదని నీకు ముందే తెలుసు. అయినా అక్కడికి ఎందుకు వెళ్ళావు, వెళ్ళినా ఎందుకు సైకిల్ పెట్టి ఆ విషయం మరిచిపోయావు. జాగ్రత్తగా ఉండద్దూ! ఇక్కడ కొడుకు ఫైల్యూర్‌కి డిజైన్ చేసుకున్నాడు. మనస్సు చిన్న చిన్న వార్నింగ్‌లు ఇస్తున్నా పర్వాలేదులే అని సైకిల్ పార్క్ చేసి, పోగొట్టుకున్నాడు. నిజానికి తండ్రి తనని ఎప్పుడో తిట్టిన విషయం కొడుకు ఎప్పుడో మరచిపోయాడు. కానీ అంతర్ మనస్సులో అది రికార్డయ్యి, ఓరకమైన చిరాకుని (ఫైల్యూర్‌ని) డిజైన్ చేసుకున్నాడు.

ఎమ్.ఎస్. నారాయణ బ్యాంక్‌లో క్లర్క్‌గా జాయిన్ అయ్యాడు. అందరూ అతనిని ఎమ్.ఎస్.ఎన్. అని అంటారు. నారాయణ చాలా పొట్టిగా ఉంటాడు. జాగ్రత్తగా గమనించండి. పొట్టిగా ఉన్న వాళ్ళకి పొగిడించుకోవాలని కోరిక ఉంటుంది. తమ పొట్టిదనం ఎదుగుదలకి ఏమీ అడ్డం కాదని, వారు నిరంతరం మదన పడుతూ ఉంటారు. ఆ ఫీలింగ్ వారి నుంచి, మంచి ఔట్‌పుట్‌ని బయటకు తీసుకొని వస్తుంది. ఉదాహరణకు నెపోలియన్, హిట్లర్, సునీల్ గవాస్కర్, సచిన్ టెండూల్కర్, చార్లీచాప్లిన్, మహాత్మగాంధి, జంఘిస్ ఖాన్, యాసర్ ఆరాఫత్, యూరీగ్రెగారి, వోల్టైర్, జిడ్డు క్రిష్ణమూర్తి, పికాసో, లెనిన్, మారడోనా, జాన్‌కీట్స్ మొదలగు వారు. దీనికి కారణం పొట్టిగా ఉన్నాం అన్న ఇన్‌ఫీరియారిటీ నుంచి మేమేంటో నిరూపిస్తాం అన్న ఫీలింగ్‌లోకి జంప్ చేసి, చక్కటి ఔట్‌పుట్‌ని తీసుకొని వస్తారు. దీనినే

ప్రో ఏక్టివ్ బిహేవియర్ అని కూడా అంటారు. తమకు ప్రతి కూలమైనది, అనుకూలంగా మార్చుకోవడమన్నమాట. అంటే గాంధీ అన్న శబ్దం వినగానే మీకు మహాత్ముని పనులు గుర్తు వస్తాయి గాని అతని పొట్టితనం గుర్తు రాదు. అలాగే సచిన్ అనగానే అతని సెంచరీలు గుర్తు వస్తాయి గాని, పొట్టితనం గుర్తు రాదు. ఇలా అయితే మరి ప్రపంచంలో పొట్టిగా ఉన్నవారందరూ ఏదో ఒకటి తమ మేరకు సాధించాలి కదా! లేదు. మనలాంటి సాధారణ పొట్టి వ్యక్తులు, న్యూనత భావనను అట్లానే ఉంచుకుంటాం. పొట్టిగా ఉన్నామనే విషయాన్ని ఒప్పుకోరు. ముందు పొట్టిగా ఉన్నామనే విషయాన్ని మన:స్ఫూర్తిగా ఒప్పుకుంటే తరువాత ఏం చెయ్యాలి అన్న ఆలోచన మొదలు అవుతుంది. సాధారణ వ్యక్తులు పొట్టిగా ఉన్నామనే విషయాన్ని విస్మరించలేక మదనపడతూ సుపీరియారిటిలోకి జంప్ చేస్తారు. సుపీరియారిటి అంటే పొట్టిగా ఉండడమే లాభం, వాడి గొప్ప ఏమిటి, మేం ఒప్పుకున్న వాళ్లే గొప్పవారు....... ఈ రకమైన దోరణి ఉంటుంది. దాంతో ఒక రకమైన అపసవ్య ప్రవర్తన అలవాటైపోతుంది. మీరు గమనించండి – పొట్టిగా ఉన్నవారు మరియు ఫిజికల్లీ చాలెంజ్డ్‌గా ఉన్నవారు కొంచెం అపశృతితో ప్రవర్తిస్తుంటారు. అలాగే బాగా లావు వున్న వారు కూడా చాలా ఫీల్ అయిపోతుంటారు. దిబ్బా అనగానే పిచ్చి ఎక్కిపోతారు. అలాగే స్కూళ్లలో కళ్లద్దాల వాళ్లని నాలుగుకళ్ల వాడని అంటారు.

ఇంతకీ మన ఎమ్.ఎస్.నారాయణ విషయానికి వస్తే, డిగ్రీ కంప్లీట్ అవ్వగానే 20 ఏళ్లకే బ్యాంక్‌లో క్లార్క్‌గా జాయిన్ అయ్యాడు. రెండు సంవత్సరాలు ఉద్యోగాన్ని ఎంజాయ్ చేసాడు. ఈలోగా పొట్టితనం మీద జోకులతో తెలివి తెచ్చుకొని ఫైల్యూర్ కి జీవితాన్ని డిజైన్ చేసుకోసాగేడు. ముందుగా ప్రమోషన్ కోసం బ్యాంక్ పరీక్షలు రాయనని ప్రకటించేడు. పీజీ చెయ్యనని మొండికేసాడు. ఇవి రెండూ చేస్తే, బ్యాంక్‌లో ఆఫీసర్ అవ్వవలసి వస్తుందని, ఆఫీసర్ అయితే అడ్డమాలిన చాకిరీ చెయ్యవలసి వస్తుందనీ, పనిగంటలు పెరుగుతాయని... ఇలా వివిధ కారణాలను చెప్పి, గుమస్తాగానే కొనసాగించదలిచాడు. పొట్టివాళ్ళకు, అవతలి వాళ్ళను తూలనాడే అలవాటు ఉంటుంది. అదిరివర్తై, పెండ్లిచూపులప్పుడు ఇంకా ఆఫీసర్ కాలేదా అన్న ప్రశ్నకు నారాయణ అహం దెబ్బతింది. ముందుగా ప్రకటించుకున్న నిర్ణయాలు మార్చుకోదల్చుకోలేదు. అంతే! యునియన్ ఏక్టివిటీస్ మొదలు పెట్టేడు. ఇరవై సంవత్సరాల తరువాత కూడా యూనియన్ ఏక్టివిటీస్‌లో బిజీగా ఉండేవాడు. సీనియారిటీ వల్ల ఆఫీసర్ ప్రమేషన్ వచ్చినా, యూనియన్ ద్వారా అందరకి సహాయం చేయాలని కొత్త మాట ప్రవేశపెట్టి యూనియన్ లీడర్‌గానే మిగిలిపోయాడు.

నారాయణ జీవితం నిస్సారంగా గడిచిందని, ఫైల్యూర్ డిజైన్ చేసుకున్నాడని మనం ఎలా చెప్పగలం? నారాయణ జీవితంలో సాధించినది మొదటగా బ్యాంక్ ఉద్యోగం. తరువాత అతను జీవితానికి

జత చేసినది ఏమీ లేదు. ఆఫీసర్‌గా ముందుకి వెళ్ళడానికి అవకాశం వచ్చినచోట, ప్రయత్నించకుండా ఆగిపోయాడు. చివరకు పెళ్ళికూడా అతని ఉద్యోగ భద్రత వలన అయ్యింది. నారాయణ జీవితం సాఫీగానే జరిగిపోయింది కదా! మరి ఈ ఫైల్యూర్ డిజైన్ గొడవ ఏమిటి? ఈ క్రింది గ్రాఫ్‌లను చూడండి.






A good life in step function



**Most Successful Life**

2వ గ్రాఫ్ లాగ నారాయణ జీవితం ఉండాలని కోరుకుంటూ రాసిన వివరణ. నారాయణ తాను స్థిరంగా ఉండిపోవడానికి జీవితాన్ని డిజైన్ చేసుకున్నాడు. యూనియన్ ఏక్టీవిటీస్‌లో భార్య, పిల్లలు పట్టకుండా తిరిగాడు. ప్రకృతిలో మార్పు సహజం. మార్పు చెందనిది ప్రకృతి పరంగా నశించినట్టే లెక్క. కేన్సర్ కణానికి చూట్టూ రేడియం పంపించడం ద్వారా కణం యొక్క ఎదుగుదలని ఆపివేస్తారు. తద్వారా ఎదుగుదల నశించి కణం అంతరిస్తుంది. ఈ రకంగా కెన్సర్‌కి చికిత్స చేస్తారు. నారాయణ తనంతట తానే ఎదుగుదలకి అడ్డువచ్చి, స్థిరమైన గ్రాఫ్‌గా మిగిలిపోయి, సరళరేఖ దిశలో సమాంతరంగా పయనించాడు. మనలో చాలామంది నారాయణ లాగ జీవితాన్ని నెట్టుకొని వస్తూ వుంటాం. తప్పులేదు. ముందు పేజీలలో చెప్పినట్లు, సక్సెస్, ఓటమి అనేవి లేవు. ఎలా బ్రతికినా సక్సెస్ ఫుల్ లైఫే! నారాయణ మార్గం కరెక్ట్ అని అనుకుందాం. అయినప్పటికి అతను కొన్ని పనులు చేస్తే ఎలా ఉంటుందో ఒక్కసారి ఆలోచిద్దాం! కార్ డ్రయివింగ్ నేర్చుకోవచ్చు. స్పోకెన్ ఇంగ్లీషు నేర్చుకోవచ్చు. యోగా నేర్చుకుని, యోగా గ్రూప్‌ని తయారుచేసుకుని ఆరోగ్యాన్ని మెరుగు పరుచుకోవచ్చు. హోమియో వైద్యం నేర్చుకోవచ్చు. సంగీతం నేర్చుకోవచ్చు. ఇలా ఏదైనా జీవితానికి ఏడ్ చేసుకొని, నిత్యనూతనంగా రోజులు వెళ్ళదీయవచ్చును.

## ఆత్మవిమర్శ

ప్రతి మనిషికి నాలుగు ఆత్మలు ఉంటాయి. అవి

1. ఆత్మన్యూనత (Inferiority)
2. ఆత్మ విమర్శ (Self-Criticism)
3. ఆత్మ విశ్వాసం (Self-Confidence)
4. ఆత్మ తృప్తి (Self-Satisfaction)

వీటిని ICCS అని పిలుచుకుందాం.




ఈ ICCS శాతాలు వరుసగా 2,48,48,2 గా ఉండాలి. కాని మనందరికి ఇవి తిరగబడి వుంటాయి. ఆత్మన్యూనత 2% బదులు 48% వుంటుంది. నాకు అంతసీను లేదు, నేను అంత ఎత్తుకు ఎదుగలేను. ఏదో ఈ జీవితం ఇట్లా గడిచిపోతే చాలు, మా ఇల్లు చిన్నది, నా భార్య అందంగా ఉండదు, నాకు లెక్కలు అబ్బలేదు, మొదలగు మాటలన్ని న్యూనత క్రిందే వస్తాయి. న్యూనత మనకు మాత్రమే ఉంటుంది, గొప్పవారికి ఉండదని మనమనుకుంటాం. ప్రతీ వారికి కనీసం 2 శాతం ఉంటుంది. అయితే వారికున్న న్యూనతని, ఆత్మవిశ్వాసం ద్వారా పోగొట్టుగోగలుగుతారు. రాజీవ్‌గాంధికి బిడియం ఉండేది. టీవిలో మాట్లాడేటప్పుడు రెండ చేతులు లాక్ చేసుకొని, పొట్టక్రింద పెట్టుకొని మాట్లాడేవాడు. ప్రముఖ రచయిత యండమూరి పాతిక సంవత్సరాల క్రితం, స్టేజి ఎక్కి మాట్లాడడానికి విపరీతంగ

భయపడేవారు. ఇదేమిటి, ఇంత పెద్ద రచయితకి గొంతు పెగలటం లేదేమిటని ఆశ్చర్యపోయేవాడిని. తనను తాను కరెక్ట్‌గా విమర్శించుకొని ఆత్మవిశ్వాసంతో సమస్యను అధిగమించిన ఆయన, ఇప్పుడు వ్యక్తిత్వ వికాస ట్రెయినింగ్ కోర్స్‌లలో ఎప్పుడూ స్టేజిమీదే ఉంటారు.

## ఆత్మన్యూనత

ఇన్‌ఫీరియారిటి అనేది ఓ పెద్ద జబ్బు. అది మనకి ఉందన్న విషయం కూడా మనం తెలుసుకోలేం. మనం చాలా న్యూనతలు పుట్టుకతోనే సంతరించుకుంటాం. నేను పొట్టి, నల్లగా ఉంటాను. ఇంగ్లీషు మాట్లాడటం రాదు. నా జాతకంలో ఇంతే రాసి వుంది. అమ్మో అది చాలా రిస్క్. ఇప్పుడు బానే ఉన్నాను కదా, ఈ జంఝాటం ఎందుకు? ఇలా ఉంటాయి మన ఆలోచనలు. ఇవన్నీ ఇన్‌ఫిరియారిటిలోకే వస్తాయి. నాకు ఫలానాది ఉంటే భూమి బొక్కెట్టెదును అన్నట్లు ఉంటాయి వీళ్ళ మాటలు.

అసలు ఎందుకు ఈ ఇన్‌ఫిరియారిటీ ఏర్పడుతుంది. ఇన్‌ఫిరియారిటీ అనే అంగవైకల్యం సంతరించుకోవడం ఒక ఫైల్యూర్ డిజైన్. ఫైల్యూర్‌కు అనుగుణంగా మారిపోవడానికి ఇన్‌ఫిరియారిటీ సహకరిస్తుంది. నలుగురు నడిచే దారిలో నడిస్తే తమకు భద్రత, ఉపశమనం ఉంటాయని అని అనిపిస్తుంది. మెదడు అత్యంత బద్ధకస్తురాలు కాబట్టి, తేలికైన న్యూనతను ఆహ్వానిస్తుంది. అందరూ ఇటువంటి "అంతసీను లేదు" అనే మనస్తత్వం తో ఉన్నారు కాబట్టి,

పైనుదహరించిన అంగవైకల్యం సంతరించుకోవడానికి, సంఘం బాగా సహకరిస్తుంది. అంతే కాకుండా 'ఓవర్ అచీవ్‌మెంట్' అన్న ఆహారం మనకు తేలికగా చిన్నప్పుడు నుండి ఇవ్వబడింది. అంత స్పీడ్‌గా పరిగెట్టలేను కాబట్టి, అంగవైకల్యం (న్యూనత) సంతరించుకొని స్లోగా పరిగెడతాను. ఫలానా కారణం వలన నేను ఆగిపోయాను గాని లేకపోతే ఎక్కడో ఉండేవాడిని. ఆత్మన్యూనత, బిడియం, సిగ్గు అన్ని దగ్గర దగ్గరగా ఉంటాయి. బిడియం, సిగ్గు, న్యూనతకు ప్రతిబింబాలే.

బిడియానికి సంబంధించి మరో ముఖ్యమైన విషయం సగటు భారతీయుడు ఓంగునే సడుస్తాడు. ఆడవాళ్ళు, మగవాళ్ళు, నేను, మీరు, మనమందరం ముందుకి ఓంగిపోయి, తలదించుకొని నడుస్తాం. తలదించుకొని నడవడం నమ్రతకు, విధేయతకు ప్రతీకగా మనకి చెప్పబడింది. కానీ ఆత్మవిశ్వాసం తక్కువ ఉన్నవారు, తానని తాను తక్కువ ప్రేమించుకునేవారు ఇలా తలదించుకొని నడుస్తారు. జర్మన్ సినిమాలు ఏవైనా చూడండి. అందరూ నిటారుగా నిలబడి నడుస్తారు. సూటిగా చూస్తూ మాట్లాడతారు. ప్రముఖ హీరో మహేష్ బాబు – ఒంగి నటిస్తాడు. సూటిగా కెమెరా ప్రక్క చూడడు. అతనిలో మనం తాదాత్మ్యత పొంది, అతనిని లైక్ చేస్తాం. అందుకే అతను అంతపెద్ద హీరో అయ్యాడు. మహేష్‌బాబు అనే పేరు మనకి వినపడగానే, అబ్బా ఫలానా సినిమాలో భలే ఏక్ట్‌చేస్తాడు అనే ఆలోచన మనకు తట్టదు. కానీ ఫలానా సినిమా చాలా పెద్ద హిట్ అయ్యింది అని తడుతుంది. అమితాబ్‌కి ఈ రెండు వీక్‌నెస్‌లు లేవు.

మనకున్న సమస్యలన్నిటికి మూలకారణం, ఆత్మవిమర్శ సరిగ్గా చేసుకోకపోవడమే లేదా ఆత్మ విమర్శ మనకనుకూలంగా చేసుకోవడమే. ఎవరైతే ఆత్మవిమర్శ కరెక్ట్‌గా చేసుకొని, న్యూనతను పోగొట్టు కోవడానికి కృషి చేస్తారో, వారికి ఫైల్యూర్ డిజైనింగ్ అంతగా జరగదు. ప్రస్తుత మధ్య తరగతి ఆధునిక తల్లిని చూడండి. పిల్లాడి మీద విపరీతమైన ప్రేమను ఒలక బోస్తుంది. అన్నిటిలోనూ ఫస్ట్ రావాలని తల్లి, పిల్లాడి కోసం చాలా శ్రమ, ఆరాటపడుతుంది. దీనికి ప్రేమని పేరు పెట్టుకొని జీవిస్తూ వుంటుంది. ఆమె కరెక్ట్‌గా విమర్శించుకుంటే, పిల్లాడి ఫస్ట్ వస్తే, తనకి నలుగురిలోనూ గొప్పగా వుంటుందన్న లాభం కోసం మాత్రమే ఆమె ఆందోళనగా పాటుపడుతూ ఉంటుంది. దీనినే నేను ముద్దు అని పిలుస్తాను. ఇదే పిల్లాడు కొంచెం పెద్దయ్యాక, ప్రేమ రాహిత్యంతో ప్రేమ కోసం యాసిడ్ బాటిల్ పట్టుకొని తిరుగుతాడు.

యాసిడ్ బాటిల్ పట్టుకొని ప్రేమ కోసం తిరిగే పిల్లాడిని, మనలాంటి తల్లే కదా కనీ, పెంచింది. పిల్లాడు పైకి రావాలనే కదా కోరుకుంది? మరి ఎందుకిలా జరుగుతుంది? మనందరికీ పిల్లాడి మీదున్న ప్రేమకి, ముద్దుకి మధ్య నున్న తేడా గ్రహించడం చాలా కష్టం.

పిల్లాడి ముద్దు గురించి చెప్పే చిన్న కథని పరిశీలిద్దాం. ఒక జంతుశాస్త్ర పరిశీలకుడు కొంతమంది స్కూల్ పిల్లలను తీసుకొని, గొంగళీ, సీతాకోక చిలుకగామారే ప్రక్రియని తన ల్యాబ్‌లో చూపెట్ట సాగేడు. గొంగళీ సీతాకోకచిలుకగా మారి బూజు నుంచి అతికష్టం

మీద బయటపడసాగింది. కష్టాన్ని, మార్పుని గమనించండి. నేను ఓ అరగంటలో వస్తాను అని పరిశీలకుడు సిగరెట్ కాల్చుకోవడానికి లాబ్ నుంచి బయటకు వెళ్లాడు. సహజంగా బయటపడడానికి కష్టపడుతున్న చిలుకకి ఊతమివ్వడానికి – ఓపిల్లాడు తన చేత్తో సీతకోక చిలుకని చాలా జాగ్రత్తగా బూజునుంచి బయటకి తీసాడు. సారు సిగరెట్ కాల్చుకుని వచ్చి చూసే సరికి, సీతాకోకచిలుక ఎగరడానికి ప్రయత్నించి, ఎగురలేక, ట్రేలో ఓ మూల చచ్చిపడి ఉంది. పిల్లాడిని సహజంగానే ఎదగనివ్వాలి.



మన్ను తింటున్నావా కృష్ణ వద్దమ్మా ఈ రాశి సిమ్మెంట్ తినమ్మా

"ఏడాదికి నీకు నాలుగేళ్లు రావాలి – ఎప్పటికి నువ్వు ముప్పయిగా మిగిలిపోవాలి" అన్నట్లు నిలబడడం రాగానే వాడికి వాకర్ కోనేస్తాం. నడవడం – పరిగెట్టడం రాగానే వాడికి రెండు చక్రాల సైకిల్ కొనేస్తాం. మనం చేసే ఇలాంటి పనులకి 'ప్రేమనో' లేక 'గత్యంతరం లేకనో' అని పేర్లు పెట్టుకుంటాం. నిజాయితిగా ముద్దని గ్రహించం. సంఘం పరిగెడుతున్న దిశలో పరిగెడతాం. ఇందులో నేను కూడా ఉన్నాను. సంఘం యొక్క వొత్తిడిని తుట్టుకోలేక కొన్ని పనులు మనమూ చేస్తాం. కాని వాటిని నిజాయితితో గ్రహించాలి. ఉదాహరణకు, అరె నీకు నాలుగేళ్లు వచ్చేసాయి. ఇంకా ఏ,బి,సి,డీ లు రావా. స్కూల్కి వెళ్ళడం లేదా. పిల్లాడిని ఇంకా జాయిన్ చేయ్యలేదా. ఇటువంటి ప్రశ్నలతో శాస్త్రియంగా ఆలోచించె తండ్రి మీద కూడా సంఘం వొత్తిడి తెస్తుంది. బ్రాహ్మణుడు – మేకపిల్ల నీతి కధలాగా ఆ తండ్రి నలుగురితో నారాయణా అని పిల్లాడిని స్కూల్లోగాని, క్రచ్లో గాని చేర్పిస్తాడు. ఐదు సంవత్సరాలు వరకు పిల్లాడు స్కూల్కి వెళ్ళనక్కర లేదన్న విషయం మనం ఎవరికి చెప్పిన ఎవరూ వినిపించుకోరు. లేటుగా స్కూల్లో జాయిన్ అయ్యి, లేటుగా డిగ్రీ కంప్లీట్ చేస్తే వచ్చే నష్టం ఏమిటట? తెలియని అవకాశాలు, రాబోవు అవకాశాలు చేజారి పోతాయి అని అనడం ఎంత హాస్యాస్పదం? ఇక్కడ లేటుగా స్కూల్లో జాయిన్ అవ్వడం అనే మాటకు అర్ధం లేదు. ఆరేళ్ళలోపు మనం మొదటి తరగతిలో ఉండాలి. కాని రెండేళ్ళ నుండి అనవసరంగా ప్రీకేజీ, ఎల్కేజీ, యుకేజీ లు ఎందుకు?

కేజీల బరువున్న పుస్తకాలు మోయడానికి తప్పా! భారతీయ విద్యావ్యవస్థ, సమూలంగాఎలా ప్రక్షాలన చేయాలో, ప్రస్తుతం నడుస్తున్న విద్యా వ్యవస్థకు ప్రత్యన్మయం ఎటువంటి విద్యావ్యవస్థ ఉండాలి లాంటి విషయాలు వేరే పుస్తకంలో డిస్కస్ చేసుకుందాం.

మనం మాట్లాడుకుంటున్నాది ఫైల్యూర్ డిజైన్ గురించి, ఆధునిక తల్లి ముద్దు, ప్రేమ పట్ల ఆత్మవిమర్శ ఎలా చేసుకోవాలో చెప్పుకుంటున్నాం. అవసరమైనప్పుడు పిల్లలతో నిర్దాక్షణ్యంగా, ఖచ్చితంగా ఉండడమే ప్రేమ. ప్రేమ వారిని ఎదగనివ్వాలి. అలా లేకపోవడం ముద్దు. పైన చెప్పిన 'అవసరమైనప్పుడు నిర్దాక్షణ్యం' అనే ఆ అవసరం ఎలా గ్రహించడం? నిజానికి నాకూ దీనికి సమాధానం తెలియదు. చుట్టూ ఉన్న సమాజాన్ని గమనిస్తూ, ఆల్‌రెడీ ముచ్చటగా ఎదిగిన పిల్లలని గమనిస్తూ, వారివారి తల్లిదండ్రులు ఏవిధంగా పెంచారో మొదలుగు పనులను మనం కూడా ఇమిటేట్ చేస్తే, పిల్లలు అపసవ్యత లేకుండా ఉంటారు. ఆత్మ విమర్శ సరిగ్గా చేసుకోక irresponsible behaviour ఎలా సంతరించుకుంటామో ఓ చిన్న ఉదాహరణలో చర్చించుకుందాం.

జాన్‌కేశవ్ మంచి బాలుడు. చక్కటి ప్రమాణాలతో పెరిగి చదువు అవ్వగానే ఉద్యోగంలో చేరి మూడు సంవత్సరాలు పోటు డబ్బు దాచుకొని, ఆ డబ్బుతో అమెరికా వెళ్ళి, అక్కడ మిగిలిన చదువు పూర్తి చేసి, చాలా పెద్ద ఉద్యోగం సంపాదించాడు. ఇటువంటి చక్కటి

# ఫైల్యూర్ డిజైన్

కుర్రాడికి పిల్ల నివ్వడానికి అందరూ ముందుకు వస్తారు. అలా వచ్చిన వాటిలో ఓ మంచి చదువుకున్న పిల్లతో పెళ్ళి సంబంధం నిశ్చయం చేసారు. నెల రోజులు తరువాత పెళ్ళి. ఈ నెల రోజులు కుర్రాడు – కుర్రది ఫోన్‌లో మాటలు, ఎస్.ఎమ్.ఎస్.లు, చాటింగ్‌లు మొదలగు ఐ.టి. ప్రక్రియ అంతా వాడుకున్నారు. 28 రోజులు గడిచాయ్. 29వ రోజున ఆ అబ్బాయి నువ్వు నాకు నచ్చలేదు అని పెళ్ళి కేంసిల్ చేసుకున్నాడు. దోశ కేంసిల్, పూరి తీసుకొనిరా అన్నట్లు! కేంసిల్ చేసుకోవడానికి అబ్బాయి చెప్పే కారణాలు నిజమైనప్పటికి, చూడండి కుర్రాడు (ఈ కాలం చాలా మంది కుర్రాళ్ళు) ఎంత irresponsible గా ఉన్నాడో! సంఘటనకి ఏ మాత్రం బాధ్యత వహించదలుచు కోలేదు. పైగా కుర్రాడి సమాధానం "పెళ్ళి జరిగిపోయి ఉంటే జీవితాంతం నేను చికాకు పడేవాడిని. ముందుగా కాదను కోవడంవలన అందరికి చికాకు కలిగినా, తరువాత జీవితాలు సుఖప్రదమౌవుతాయి".



మనం రాజకీయ నాయకులను దుమ్మెత్తి పోస్తాం. నానా బూతులు తిడతాం. ఎందుకు వారు బాధ్యతగా ప్రవర్తించటం లేదని. మంచి సంఘటనలకి ముందుకు వొస్తున్నారు, చెడు సంఘటనలకి బాధ్యత వహించకుండా పారిపోతున్నారు. ఇటువంటి రాజకీయ నాయకులను మనలాంటి తల్లే కదా పెంచింది? మరి ఎందుకు బాధ్యతా రాహిత్యంగా ఉన్నారు. పైన చెప్పిన ఉదాహరణలో పెళ్ళికోడుకు ఉద్యోగం చేసుకుంటున్నాడు. అదే వ్యక్తికి రాజకీయాలంటే ఇష్టమై, రాజకీయ నాయకుడు అయ్యి ఉంటే? ఇదే బాధ్యతా రాహిత్యం అక్కడ కూడా చూపెట్టేవాడు కదా! జాన్‌కేశవ తల్లిదండ్రులు ఈ విషయాన్ని గ్రహించరు, ఆత్మ విమర్శ చేసుకోరు. ఏదో మన మంచికే అచ్చుపొరపాటు జరిగిపోయిందని అంటారు. వెనువెంటనే, నాయకులను, వ్యవస్థను ఆడిపోసుకుంటారు. మనం, మన జీవితం వేరు, నాయకుల జీవితం వేరు అని అనుకుంటాం. వారు పట్టుకతోనే వెధవలుగా పుట్టేరని నిర్ణయిస్తాం.

మనకి బాధ్యతగా కనపడిన మొట్టమొదటి రాజకీయ వేత్త లాల్ బహాదూర్ శాస్త్రి, ఎక్కడో రైలు ఏక్సిడెంట్ అయితే తాను బాధ్యత వహించి పదవికి రాజీనామా చేసిన మహా వ్యక్తి. అంతకు ముందు మహాత్మగాంధీ చౌరీచౌరా సంఘటనలో పోలీస్ స్టేషన్ ముట్టడికి తాను బాధ్యతవహించి, యావత్ దేశానికి వ్యతిరేకిగా, విలన్‌గా నిలబడ్డాడు. అయినా గాంధి తాను నమ్మిన సిద్ధాంతానికి బాధ్యత

వహించి, వ్యతిరేకత వచ్చినా చలించకుండా నిలబడి, మహాత్ముడు అయ్యాడు.

ఇంతకీ నేను చెప్పదల్చుకున్నదేమిటంటే, బాధ్యతారాహిత్య ప్రవర్తన ఫైల్యూర్‌కి జీవితాన్ని డిజైన్ చేస్తుంది. జాన్‌కేశవ ఏమిచెయ్యాలి? ఎంత డబ్బు ఖర్చు అయినా, అందరిని కూర్చోబెట్టి, తాను ఎందుకు పెళ్ళికి ఒప్పుకోవటం లేదో చెప్పాలి. అవతల వారిని ఒప్పించాలి. ఒకవేళ జాన్‌కేశవ చెప్పే కారణాలు సరియైనవి కావని కొట్టిపారేస్తే, 28 రోజులు ఆనందంగా ఫోన్‌లో మాట్లాడిన దానికి ప్రతిఫలంగా, బాధ్యత వహిస్తూ ఆ అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలి. తరువాత ఆమెను అనుకూలంగా మార్చుకోవడానికి ప్రయత్నించాలి.

ఎందుకిలా జరిగిందన్న దానికి సైకోఅనాలసిస్ – విశ్లేషణ చేస్తే – జాన్‌కేశవ్ తల్లిదండ్రులు లేదా చుట్టూ ఉన్నావారు – బాధ్యత లేకుండా ప్రవర్తించ బట్టి, ఒక మాట ఇచ్చి, మాట నిలబెట్టుకోవలసి వచ్చేసరికి మొహం చాటు వెయ్యడం వలన! నేనున్నాకదా నువ్వు డబ్బు గురించి ఏమీ ఆలోచించక అని చెప్తాం. కాని సరిగ్గా డబ్బు అందజేయ్యాలిన సమయానికి మన దగ్గర డబ్బు ఉండదు. మనకి మాట తప్పాలని లేకపోయినా మాట తప్పుతాం. ఈ విషయం ఎవరికి తెలియదనుకుంటాం. కాని మన పిల్లలు ఆటోమెటిక్ గా గ్రహిస్తారు. ఇంకో కారణం నీతివాక్యాలు. కొంత మంది తల్లిదండ్రులు పిల్లలకి ఎప్పుడూ నీతినే బోధిస్తూ ఉంటారు. తాము కరెక్టగా ఉన్నామని, సంఘం మాత్రం నీతి తప్పుతోందని, సంఘంలో ఉన్న కుళ్ళని ఎప్పుడు

ఎవరు కడుగుతారో లాంటి మాటలతో బ్రతుకుతూ ఉంటారు. సంఘంలో తాము భాగమని, సంఘానికి తమ వోంతు కుళ్లు కూడా చేరుతుందని గ్రహించకుండా మాట్లాడుతూ నీతి బోధనలు చేస్తూ ఉంటారు. అందువలనే, తమని చూట్టూ ఉన్న వారు పెద్దగా ఇష్టపడరని చెబుతూ ఉంటారు. ఇక్కడ గాంధి అంటే అందరూ ఇష్టపడతారన్న విషయం మరచిపోతారు. అంతే కాకుండా మేం ఈ సంఘానికి ఏ విధంగా కుళ్లుని అందజేస్తున్నామని ప్రశ్నిస్తారు.

ఒక టీచరు లేదా బ్యాంక్ క్లార్క్ మేం నీతిగా ఉంటున్నాం, లంచం తీసుకోవటం లేదని చెప్పడం కొంచెం హాస్యాస్పదం. ఎందుకంటే తమకు లంచం ఇచ్చే వెథవే ఉండడు. అదే మీరు ఒక ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్‌లోనో, ఎమ్.ఆర్.ఓ ఆఫీస్‌లోనో, ఇలా లంచాలు వచ్చె డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తూ, లంచాలు తీసుకోకుండా ఉంటే, అప్పుడు మీరు చెప్పే లంచ వ్యతిరేక సూక్తులుకి అర్థం ఉంటుంది. ఒక సాధారణ వ్యక్తి సమాజానికి అందించె కుళ్లు – ఆఫీసుకి లేటుగా వెళ్లడం, జీతానికి సరిపడ పని సమర్ధవంతంగా చెయ్యకపోవడం, ఆర్.టి.సి. బస్సులలో ఆడవాళ్లు సీట్లలో కూర్చోని, స్త్రీలు వచ్చినా లేవకపోవడం... ఇలా (చాలా) ప్రతి విషయం. ఇటువంటివి మనకి తెలియకుండా మన పిల్లలు గమనిస్తూ ఉంటారు. మనం ఆత్మవిమర్శ చేసుకోకుండా, మన 'నక్కజిత్తుల ప్రవర్తన' వలన (చాలా చిన్న విషయాలు కావచ్చు) – మన పిల్లలకి అందజేసే విషయం బాధ్యత తప్పినప్పుడు సారీ చెప్పేయవచ్చు – పర్వాలేదని! తద్వారా ఫైల్యూర్ డిజైన్ అవుతుంది.

## ఫైల్యూర్ డిజైన్

శ్రీరాముడిని నమ్మే వారు మాటతప్పవచ్చని, అల్లాని నమ్మేవాడు అబద్ధమాడవచ్చని – ఇది ఫైల్యూర్ కాదని అంటే – వారికి నా దగ్గర సమాధానం లేదు. పూర్తిగా నీతిగా ఉండడం – పూర్తిగా మాట తప్పకపోవడం – పూర్తిగా అబద్ధాలు ఆడకపోవడం – సాధ్యపడక పోవచ్చు. నేను చెప్పేదేమిటంటే ఎప్పటికప్పుడు ఆత్మవిమర్శ కరెక్టగా చేసుకోవడం. తప్పుల ద్వారా అనుభవం పొంది – నడవడికను మార్చుకుంటూ – గమ్యంవైపు దూసుకుపోవడమే!

<u>తప్పుల నుండి నేర్చుకో</u>




"చెప్పండి. చెంప ఎలా కాలింది"

"డాక్టర్ నేను ఐరనింగ్ చేస్తున్నపుడు మా ఫ్రెండ్ కాల్ చేసాడు. ఫోన్ అనుకొని ఇస్త్రీ పెట్టె చెవ్వి దగ్గర పెట్టుకున్నాను"

"మరి రెండో చెంప ఎలా కాలింది"

"ఆ ఇడియట్ మళ్ళీ ఫోన్ చేసాడు"

## ప్రముఖ వ్యక్తులు

ఆత్మ విమర్శ సరిగ్గా చేసుకోలేక, తమకి కావలసిన దేమిటో తెలుసుకోలేక చూస్తుండగానే ఫైల్యూర్‌ని దొరకబుచ్చుకున్న వ్యక్తుల గురించి ప్రస్తావించుకుందాం. ఫైల్యూర్ అంటే నష్టపోవడం కాదు, నిత్యనూతనంగా ఉండలేకపోవడం అని మరి యొక సారి గుర్తు తెచ్చుకుందాం.

### మైకేల్ జాక్సన్



ప్రపంచంలో ఎవరూ ఊహించలేనంత పరపతిని సాందిచాడు. దాన్ని నిలుపుకోవడం, తట్టుకోవడం చేతకాక – ప్లాస్టిక్ సర్జరీలు, పసి పిల్లలతో సెక్స్, కోర్టుకేసులు, స్థాయిని మించిన జీవనశైలి, ఇవేవి స్థిమితాన్ని, మనశ్శాంతినీ ఇవ్వలేని నేపథ్యంలో నిద్ర మాత్రలు, మత్తు మందులకు మరిగి, వాటిని అదుపులో పెట్టుకోలేని దిశలో తాను సాధించిన  అపూర్వమైన కళని పెంచుకునే, లేదా ప్రదర్శించే సామార్థ్యాన్ని కోల్పోయి, పది సంవత్సరాలు అజ్ఞాతంలో, కేవలం డిప్రెషన్‌లో బతికి ఏభయ్యేళ్ళకే నూరేళ్ళ నిండిన ఓ అపూర్వ కళాకారుని దయనీయమైన చరిత్ర. విజయాన్ని  నిలబెట్టుకోలేక, తనకు ఏమిటి

బావుంటుందని తెలుసుకోలేక (ఆత్మవిమర్శ సరిగ్గా చేసుకోలేక), ప్రజలకు ఇష్టమైన తెలుపు తొక్క కోసం ప్లాస్టిక్ సర్జరీలు, మొదలగునవి - ఫైల్యూర్ డిజైన్స్. అవసాన దిశలో మైకల్ జాక్సన్ ముస్లీమ్ మతాన్ని పుచ్చుకున్నాడు కూడా!

మరి మైకేల్ జాక్సన్ ఏమి చెయ్యాలి? సక్సెస్‌ని ఎలా హేండిల్ చేయ్యాలి? పరపతిని సంపాదించడం, నిలదొక్కుకోవడం రెండూ భయంకరమైన అగ్ని గుండాలే చల్లార్చడానికి నీరు మాత్రమే సరిపోదు. రెచ్చగొట్టే గాలిని ముందు ఆపగలగాలి. ఆత్మజ్ఞానం కావాలి, ఉదాత్తత కావాలి, గొప్ప సంయమనం కావాలి. గొప్ప ఆదర్శం కావాలి. గొప్ప సంస్కారం కావాలి. ఓ మహత్తరమైన కృషిని ప్రపంచంతో పంచుకునే అలౌకికమైన దృష్టికావాలి. మన జీవితాలను నిశబ్దంగా స్పృశించాలి. మనవాళి నుండి తీసుకోవడంలో కాదు. ఇవ్వడంలో పరపతికి చిరంజీవత్వం వస్తుంది. ఇటువంటి వారే ధామస్అల్వా ఎడిసన్, దెరిస్సా మొదలగువారు. వీరిని మైకేల్ జాక్సన్ అనుకరించాలి.

మాయావతి



# ఫైల్యూర్ డిజైన్

తన విగ్రహాలు తానే ఆవిష్కరించుకున్న ఘనత చరిత్రలో ఈవిడదే! కేవలం తన పరపతిని పెంచుకోవడం కోసం ఇటువంటివారు ఇలాంటి పనులు చేస్తారు.

తన అధికారం నిలబడదేమొనన్న ఆందోళనతో, తనకున్న అధికారానికి అర్థ్వారాలినికానేమొనన్న భయంతో – ఇటువంటి పనులు చేస్తారు. 'హమ్మయ్య నా అధికారం నిలబడింది' అన్న ఆత్మ తృప్తి కోసం పిచ్చిపనులు చేస్తారు. అప్పటికి మనశ్శాంతి దొరికినా తరువాత ముందువున్న ఆందోళన, భయం అట్లానే ఉండిపోతాయి. అవి పోగొట్టుకోవడానికి ఇంకొక ఫైల్యూర్ మనస్సు డిజైన్ చేస్తుంది. ఇక్కడ వీరు కరెక్ట్‌గా ఆత్మవిమర్శ చేసుకోరు. 'ఫాలింగ్ ఇంటూ సక్సెస్' అంటారు యండమూరి. సడెన్‌గా వచ్చిన అధికారాన్ని, అందలాన్ని హేండిల్ చెయ్యలేక ఫైల్యూర్ డిజైన్ చేసుకుంటారు.

తనకి అయాచితంగ లభ్యమైన అధికారిన్ని అలైకికమైన దృష్టితో చూడాలి. తనకి అర్హత లేకపోయినా అధికారం వచ్చింది. ఇది కృషి ఫలితం కాదు. యధాలాపంగా వచ్చింది. ఇలా కరెక్టగా ఆత్మవిమర్శ చేసుకుంటే ఆటోమెటిక్‌గా ప్రజలకు ఉపయోగపడే ఆలోచనలు మొదలవుతాయి. అధికారం ఉన్న వ్యక్తికి ఆలోచన అంటూ వస్తే చాలు కదా దేశం మారిపోవడానికి.

# ఫైల్యూర్ డిజైన్

## చంద్రబాబునాయుడు



ఈయనకు మొదటి సారి అధికారం కూ (coup) వలన వచ్చింది. ప్రజా స్వామ్యం లో కూ అనే మాటకు అర్ధం లేదు. చట్టబద్దత మాత్రమే వుంది. అది వేరే విషయం. రెండవ దఫా అధికారం ఎలక్షన్ ద్వారా వచ్చింది. మొదటి సారి వచ్చిన అధికారంలో నాలుగు ఏళ్లు చేసిన 'మంచి' పనుల వలన రెండవసారి అధికారం వచ్చిందని రాంగ్‌గా ఆత్మవిమర్శ చేసుకున్నారు. అంతే రెండవ సారి వచ్చిన సక్సెస్‌ని అలైకిక దృష్టి లేకపోవడం వలన నిలబెట్టుకోలేకపోయారు. అలౌకిక దృష్టి అంటే తెలియదేమోనని ఎక్కడో దక్షిణ కొరియాలో విజయవంతమైన జన్మభూమిని ఆంధ్రదేశంలో ప్రవేశపెట్టారు. తనకు ఏమిటి కావాలో తెలియని స్థితిలో స్కూల్ పిల్లలని ఎండలోని, వానలోని మానవహారం పేరిట నిలబెట్టారు. సాధించినది ఏమిటి? జన్మభూమి అంటే ఎక్కడబడితే అక్కడ తన పేరు వినబడాలని, తన గురించి అందరికి తెలియాలన్ని ఆందోళన మాత్రమే. జన్మభూమి అంటే

జన్మభూమి ఎక్స్‌ప్రెస్ రైలు అంత విజయవంతమై పోతుందని ఆశించారు.

దక్షిణ కొరియా అంతా ఒకటే బాష. అందరికి దేశభక్తి ఉంది. ప్రతి ఒక్కరు హైస్కూల్ – కాలేజీ లెవెల్లో కమ్యూనిటీ సర్వీస్ చెయ్యందే ఉద్యోగం ఇవ్వరు. కమ్యూనిటీ సర్వీస్ వలన అక్కర లేకపోయినా దేశభక్తి వస్తుంది. సంఘ పరంగా ఆలోచించడం అలవాటవుతుంది. కాని మనం, కులాల వారిగా, ప్రాంతాలవారిగా భాషా పరంగా, ఇంకా రకరకాలుగా విడిపోయం. మన చదువుల్లో దేశభక్తి ఏది? ఈ దేశం నాకేం ఇచ్చిందన్న ఆలోచన దోరిణి తప్పా! దీనికి తోడు వాస్తవ ప్రపంచం దేశాన్ని దోచేయడానికి పూర్తి గొల్పుతోంది. అందినకాడికి దేశాన్ని దోచెయ్. వీలయితే దేశాన్ని అమ్మివెయ్యి. అందుకే సంఘ విద్రోహక శక్తులకు, టెర్రరిస్టులకు సాదారణ వ్యక్తులే తమ ఇళ్ళలో ఆశ్రమం కల్పిస్తున్నారు? మన రక్తంలో దేశభక్తి, ఆత్మగౌరవం ఉంటే ఇటువంటివి జరుగుతాయా? ఇప్పటికైనా మనం, మన పిల్లలకి ఈ దేశానికి నేను ఏమిచేయగలను అన్న ఆలోచన దోరణి కల్పించాలి. వారిని నిత్యం ఇళ్లలో నువ్వు ఈ దేశానికి ఏమి చేయగలవు అని ప్రశ్నించాలి. కాని మనం చేస్తున్న దేమిటి? ఎక్కువ డబ్బు కూడ బెట్టు – లగ్జరీగా బ్రతుకు అన్న మాటలతో పాటు, ఈ దేశానికి ఏదైనా చెయ్యరా నాయనా అని అంటూ ఉండండి.

ముక్కలుగా ఉన్న మన వ్యవస్థలో జన్మభూమి ద్వారా – మా గ్రామానికి మేము కొంచెం ఏదైనా చేసుకుంటాం అన్న ఆలోచన

కల్పించడం ఒక్క పిసరు హాస్యాస్పదం. పైగా ఆ ప్రయత్నంలో చిత్తసుద్ధి లేదు. ఎంతసేపు చంద్రబాబు నాయుడు తన పేరు మారుమోగాలనే ఆలోచనే తప్పా! దీనికి తోడు ఆ కార్యక్రమాలల్లో మన అధికారుల శుశ్రుత సేవలు! (sycophancy) ఇక నాయుడు గారి రెండవ ఫెయిల్యూర్ డిజైన్ కలెక్టర్ల మీద, అధికారుల మీద – వీడియో కాన్ఫెరెన్స్‌లలో మండిపాటు. పాటుపడితే పేరు రావాలి గాని – పేరు కోసం పాటు పడకూడదు. హైటెక్ ముఖ్యమంత్రని మీడియా కల్పించిన పేరు. ఆపేరు ఆయన నిజమనుకున్నారు. దీనికి పెద్ద ఉదాహరణ అంత భారిగా డెవెలప్ చేసిన హైదరాబాదు నగరంలో ఒక్క సీటు కూడా తెలుగుదేశం ఎలక్షన్‌లల్లో గెల్చుకోలేకపోయింది. నేను బాధపడే విషయం ఆయన ఎలక్షన్ ముందు కారు బాంబ్ బ్లాస్ట్‌లో చావు వరకు వెళ్ళి, వెనక్కి తిరిగి వచ్చినా – ఓటర్లను ప్రభావితం చేసి నియంత్రించలేకపోయారు.

ఒక జర్మన్ సైనికుడు గుడారంలో నిద్రిస్తున్నప్పుడు ఒక కల వచ్చింది. తన కేంప్‌కాట్ (మడత మంచం) క్రింద బాంబు ఉన్నట్లు. వెంటనే ఆ సైనికుడు కంగారుగా నిద్రలేచి బయటికి పరిగెట్టాడు. వెంటనే బాంబు పేలింది. తరువాత ఆ సైనికుడు ఆలోచనా విధానం మారిపోయింది. తాను చావు నుంచి రక్షించబడ్డానంటే దీనికో బలమైన కారణం ఉంటుంది. నా వలన ప్రపంచానికి ఎదో జరుగుతుంది. ఇలా అతని ఆలోచనలు సాగాయి – ఆ తరువాత ఆ సైనికుడు నియంత అయ్యాడు. అతని పేరే హిట్లర్. హిట్లర్ అనే

మాటకు నియంత అనే అర్థం వాడుకలో ప్రపంచం అంతా ఉంది. ఇక్కడ మనం గమనించవలసింది – ఒక వ్యక్తి సైనికుడి స్థాయినుంచి ప్రపంచాన్ని గడగడలాడించిన స్థాయికి ఎదిగిన అతని మనోధైర్యం గురించి. హిట్లర్ యొక్క పనులు గురించి కాదు. (హిట్లర్ కూడా పొట్టివాడు, శాఖాహారి).

ఆత్మవిమర్శ గురించి చాలించే ముందు ఓ చిన్నమాట. మహాత్ములకి విగ్రహాలు అవసరం లేదు. నేలబారు మనుషులకే సిమ్మెంటు ముఖాలు కావాలి. చరిత్రలో చెరపలేని కీర్తికి పెట్టుబడి సామర్థ్యం మాత్రమే కాదు, ఔదార్యం, జీవుని వేదన కావాలి. మానవాళి నుంచి తీసుకోవడంలో కాదు. ఇవ్వడంలోనే అలౌకీకమైన ఆనందం ఉంది. చివరిగా, తన జీవిత కాలంలో కేవలం 143 మైళ్ళు మాత్రమే తిరిగిన ఏసు ప్రభువు ఇవాళ ప్రపంచంలో మూడు వంతుల మానవాళిని రెండు వేల సంవత్సరాలుగా ప్రభావితం చేస్తున్నాడు. ఆయన శిలువ మీద తన ప్రాణాలు ఇచ్చాడు. కాని ప్రజల ప్రాణాలు బలికోరలేదు. జాతికి ఆధ్యాత్మిక సంపదని పంచిన ఆది గురువులు ఆది శంకరాచార్యులు చిరంజీవులు.

ఇప్పటి వరకు చెప్పుకున్నవి ఆత్మన్యూనత మరియు ఆత్మ విమర్శ గురించి.

ఇక మూడవది ఆత్మవిశ్వాసం (సెల్ఫ్ కాన్ఫిడెన్స్). ఇది 48% శాతం ఉండాలి. దురదృష్టవశాత్తు 2% కలిగి ఉంటాం. కాని 48%

ఉన్నట్లు నటిస్తూ ఉంటాం. ఆత్మవిశ్వాసం అంటే అర్థం ఏమిటి? ఒక పని చేయగల సామర్థ్యం ప్రకటించడమే. నేను ఎటువంటి ట్రాఫిక్‌లో అయిన బైక్ డ్రయివ్ చేయగలను. ఈ పరీక్ష గ్యారంటీగా ప్యాస్ కాగలను. చదరంగంలో వీడిని ఈజీగా ఓడించగలను. నేను క్రికెట్ టీమ్‌లో ఉంటే నా వాటా 40 రన్నులు వేసుకోవచ్చు. పైవి చిన్న విషయాలే కదా ఆ మాత్రం నమ్మకం అందరికి ఉంటుంది కదా అని అనుకోవచ్చు. కాని చాలా మందికి చాలా విషయాల్లలో నమ్మకం ఉండదు. చాలా చిన్న పనులు కూడా వీరు చేయలేరు. నమ్మకాన్ని కొంచెం కూడా వ్యక్తం చేయలేరు. ఆ ఎవడూ చేస్తాడు అవన్ని అని ప్రశ్నించుకుంటారు. బ్రేక్‌లూజ్ అయితే చేత్తో సులువుగా బిగించగల నట్టుని కూడా వీరు తెలియదంటారు. ప్రతి సారీ మెకానిక్ దగ్గర చూస్తారు. అయినా కూడా తెలియదు. అంతే! ఎమర్జెన్సిలో వంట ఇంట్లో కాఫీ కూడా కలుపలేరు. ఈ నమ్మకం తగిన శాతం లేకపోవడం వలన వీరు తగినంత డబ్బుని ఉత్పత్తి చేయలేకపోతున్నారు. తగినంత డబ్బు అంటె కనీస అవసరాలు, కనీస లగ్జరీలకు సరిపడ అంతా అని.

మనకు మన మీద మనకు ఎదురైన రంగాలలో తగినంత నమ్మకం లేకపోవడం దురదృష్టం. విజయానికి అయిదు మెట్లులో మీ శక్తి మీరు కరెక్టగా అంచనా వేసుకోండి, అనేది ఒక మెట్టు. దీనికంటే దారుణ విషయం – తమ నైపుణ్యాన్ని మెరుగు

పరుచుకోవడానికి ప్రయత్నించకపోవడం. ఎవడు చేస్తాడు అవన్నీ అనే నిర్లిప్తత. ముఖ్యంగా సగటు భారతీయులందరికి ఈ జబ్బు ఉంది. ప్రస్తుతం ఆఫీసులో కంప్యూటర్ నేర్చుకుంటే ఆ పని కూడా తనకే చెప్తారని కంప్యూటర్ ఆపరేషన్ నేర్చుకోకపోవడం. కారు డ్రయివింగ్ వచ్చు అంటే ఎక్స్ట్రా పని చెప్తారేమోనని భయపడడం. ఎలక్షన్ డ్యూటి ఎలా ఎగ్గొట్టడం. ఇలా చాలా చెప్పుకుంటూ పోవచ్చు.

ఒక క్లిష్టమైన పని చేసాక ప్రశాంతత, నమ్మకం చెప్పనలవి కావు. విశ్వాస శాతం 48 అనేది ఒక స్కేల్ గా భావించాలి. అన్ని విషయాలల్లో మనకి 48 % ఉంటే మనవి ఎవరూ పట్టలేరు. మనకి కొన్ని విషయాల్లో 10%, కొన్ని విషయాల్లో 30% కొన్నిటిలో 48% ఇలా ఉంటుంది. ముందు పేజీలల్లో బ్యాంక్ క్లర్క్ ఎమ్.ఎస్.నారాయణ గురించి చెప్పాం. అతను తన స్కిల్స్‌ని ఇంప్రూవ్ చేసుకోక ఒకే స్థాయిలో ఉండి పోయాడు.

ఆత్మ విశ్వాసం

ఆత్మవిశ్వాసం ముగించబోయే ముందు ఓ మాట. మనకు సెల్ఫ్ కాన్ఫిడెన్స్ లేదా నమ్మకం లేక పోవడానికి కారణం మన కల్చర్, మరియూ మన అలవాట్లు. మన కల్చర్‌లో గురువుగారికి, పెద్దవారికి ఊడిగం చెయ్యడం నేర్పుతుంది. అలా చెయ్యకపోతే బ్రహ్మాండాం బద్దలు అయిపోతుందని నమ్మబలుకుతాం. మన కల్చర్‌లో ఓ భాగమే మన అలవాట్లు. అర్హత లేకపోయినా దక్షిణ వేసి దేవుడిని కోరుకుంటాం.

ఇది ఆత్మవిశ్వాసానికి వ్యతిరేకం కాదా? ఒక వేళ కోరుకున్నది దొరికి ఆఫీసర్ అయిపోయాడనుకుంటే – ఇంక అంతే సంగతులు. ఇటువంటి కాన్ఫిడెన్స్ లేని వ్యక్తుల పరిపాలన వలన మన సొసైటీ ఇలా అఘోరిస్తోంది. పైనమ్మకాలను చెదరగొట్టేదే చదువు!

మన రాజకీయ నాయకులు దగ్గనుండి మన చదువులను భ్రష్టు పట్టిస్తున్నారు. చదువు మనకి నమ్మకం ఇవ్వాలి గాని, ఆందోళనని, అపనమ్మకాన్ని ఇవ్వకూడదు. ఈ చదువులు మాకొద్దు అనట్లుగానే వున్నాయి మన చదువులు. చదువుకుంటే జీవితం మారిపోతుంది అన్న టైటిల్‌తో మన చదువులు నడుస్తున్నాయి. ఆత్మ విశ్వాసంతో పైకొచ్చిన నిజజీవత ఉదాహరణలు ఎన్ని ఇస్తే మాత్రం ఏం లాభం? మళ్లీ మనం పాత ఒరవడి 'చదువుల మూటను' నెత్తికెక్కించు కుంటున్నాం.

ఇప్పటి వరకు చదివిన పై పేరాలో గ్రహించిన విషయం ఏమిటి? ఈ దేశంలో లాభంలేదు. ఇది ఇంతే అని అనిపించడం లేదు? అంటే ఫైల్యూర్ వైపు మనస్సు పరిగెడుతోంది. వ్యవస్థ పునాదుల లెవెల్‌లో మార్పువొస్తేగాని, నమ్మకం ఏర్పడదు. వ్యవస్థ మారదు కాబట్టి, నేను మారతాను నమ్మకాన్ని చేజిక్కించుకుంటాను.

నేను ఎందుకు ఎదగలేదో – కారణాలు చెబుతున్నంత కాలం పరిమితంగానే ఉంటాను. కారణం చెబుతున్నామంటే ఫైల్యూర్ వైపు అడుగులు వేస్తున్నట్లే. ఇప్పటికైనా కళ్ళు తెరుచుకుందాం.

డబ్బు గతంలో లేదు, వర్తమానంలో, భవిష్యత్తులో మాత్రమే ఉంటుంది. డబ్బు అంటే కరెన్సీ కాదు. డబ్బు అంటే స్కిల్, డబ్బు అంటే నమ్మకం. ఎవరూ ఊరికినే డబ్బు ఇవ్వరు కదా! డబ్బు ఉత్పత్తి చేయ్యాలంటే ఆత్మ విశ్వాసం ఉండాలి. కారణం దొరికిందా (ఫైల్యూర్ డిజైన్) ఫుల్ స్టాప్ పడిపోతుంది. వాట్స్‌ప్‌లో వొస్తున్న విశ్వాస గాధలు నేను ఇక్కడ రాయదల్చుకోలేదు.

ఆత్మతృప్తి

ఈ సెల్ఫ్ సాటిస్‌ఫేక్షన్ గురించి చెప్పడం చాలా కష్టం. బాధే సౌఖ్యం రా అన్న భావన రానీకు అన్నాడు సముద్రాల. ఈ ఆత్మతృప్తి వలన మనం త్వరగా కంఫర్ట్ జోన్‌లోకి వెళ్తాం. కంఫర్ట్‌జోన్ అంటే ఎటువంటి కష్టం, ప్రమాదం, ఆందోళన రాకుండా ఉండే జోన్.

ఆత్మతృప్తి అనేది ఒక జాఢ్యం. అందుకనే అది రెండు శాతం ఉండాలని రాసేను. ఎదో సాధిద్దామని మనం పని చేస్తాం. ఒక్కొక్క మెట్టు ఎక్కుతుంటే తృప్తి పెరుగుతూ ఉంటుంది. అలా 48 శాతం రాగానే కంఫర్ట్ జోన్‌లోకి వెళ్ళిపోతాం. కంఫర్ట్ జోన్‌లో నున్న వ్యక్తి దగ్గర నుండి సొసైటీకి అవుట్‌పుట్ ఏమీ ఉండదు. కొద్ది కాలం కంఫర్ట్ జోన్‌లో ఉండి ఆ సక్సెస్ అనుభవించి, తరువాత ఆత్మ విమర్శ కరెక్టగా చేసుకొని, 48 శాతం ఉన్న తృప్తిని 2 శాతానికి మార్చుకొని కొత్త గోల్స్, కొత్త ప్రయత్నాలు ప్రారంభించాలి. దీనికి వయస్సుతో సంబంధిం లేదు. మన బ్యాంక్ క్లర్క్ నారాయణ ఎన్నో చెయ్యవచ్చు అని

చెప్పుకున్నాం. అంటే ఆత్మతృప్తి కలిగేక నేర్చుకోవడానికి చుక్కపెట్టకూడదు. నేను కొత్త విషయాలు నేర్చుకోనక్కర లేదు. అంటే నశించిపోతున్నట్లే లేక్క. నేను బావున్నాను. మరింత బావుండడానికి ఏం చేయ్యాలి అని అనుకోవడమే ఆత్మతృప్తి. జపాన్‌లో ఎక్కువగా వినిపించే వాక్యం There is always a better way. దీనినే Kaizen అని అంటారు. డబ్బు సంపాదించడం ఒక వ్యవనమైతే (ఉదాహరణకు Waren Buffet) ఆత్మతృప్తి సజావుగా ఉంటుంది. ఆ వ్యసనం ఆందోళనగా మారకుండా చూసుకోవడమే మన పని.

**EXAMPLES OF FAILURE DESIGN**

ఈ పుస్తకానికి ఇదే ముఖ్యమైన 'ముందుమాట' చిన్నప్పుడు పిల్లాడు స్కూల్‌కి వెళ్లనక్కర లేకుండా తల్లి దగ్గర ఉండిపోవడానికి, దెబ్బ తగిలించు కుంటాడు. అక్కడ మొదలైవుతుంది ఫైల్యూర్ డిజైన్. అది వృక్షంలో వివిధ శాఖలుగ విభజించబడి రకరకాలుగా విస్తరిస్తుంది. ఈ ఫైల్యూర్ వలన నష్టం ఏమిటి? ప్రతి వ్యక్తి ఈ రకమైన నిస్పృహని అస్వాదిస్తూంటే మొత్తం సొసైటి ఎలా ముందుకు నడుస్తుంది? ఆఖరుకి ఆనందం ఎక్కడ ఉంటుందో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. ప్రజలు ఆనందంగా ఉన్న దేశాల్లో మనది 130వ స్థానం.

అంటే నిత్యం మనల్ని నిస్పృహ వెన్నాడుతూ ఉంటుందన్నమాట. జమిందార్ల వ్యవస్థ నుండి మన దేశం ఉద్భవించడంతో మనకి పనివాడి మనస్థత్వం అలానే ఉండిపోయింది. దీన్ని పోగొట్టుకోవడానికి

ఎడ్యూకేషన్ ఒక టూల్. బానిస మనస్థత్వంతో ఏమిటి ఆలోచిస్తాం? కరెన్సీ డబ్బు ఎలా సంపాదించాలి? ఎలా జమిందారు అవ్వాలి అని? అందుకే మన మందరం డబ్బు కోసం అలా పరిగెడతాం. అంతేకాదు. పేదరికం అంటే భయం కొద్ది డబ్బు మూటగడతామేమో గాని డబ్బు ద్వారా దొరికే స్వేచ్ఛని వెతకం.

దీనికి తోడు మన రాజకీయ వ్యవస్థ మనల్ని ఆలోచనా పరంగా నిస్తేజనుల్ని చేసింది. రోడ్ ఎక్కగానే అడ్డదిడ్డమైన ట్రాఫిక్‌ని తయారు చేసేరు. మనం వాడిని వీడిని తిట్టుకుంటాం. కాని దాన్ని తయారు చేసిన వ్యవస్థాపకుడిని అంటె గవర్నమెంట్‌ని తిట్టుకోం. నేను ఆలోచించడం మొదలుపెడితే గవర్నమెంటులు కదలిపోతాయి. కాబట్టి, ట్రాఫిక్‌ని తెలివిగా అతలాకుతలం చేసి నన్ను ఆలోచించనివ్వటం లేదు. ఇది ప్రజలు యొక్క సాంఘిక ఫైల్యూరు.

ఇంక సాధారణ జీవితాల్లోకి వొస్తే, డబ్బులేక ఎయిరోనాటికల్ ఇంజనీరింగ్ బెంగుళూర్ లో చదువుకోలేదు. అందుకనే గుమస్తాగా ఉండిపోయాను. ఇది ఎంత హాస్యాస్పదం? ఒక గృహిణికి నిత్యం ఏదో రోగమే. భర్త తనకు ప్రాధాన్యత ఇవ్వాలని ఇలా రోజూ రోగాలను ఆస్వాదిస్తుంది. రోగాలను ప్రేమిస్తూ, భర్తతో డాక్టర్ల చుట్టూ తిరుగుతూ తమ ఫ్యామిలీ మొత్తం ఎదగకుండా ఉండడానికి ఈ మాయదారి రోగాలే కారణం అని సొసైటిని నమ్మించ చూస్తుంది. భార్యా భర్తలు తమ అవసరాలు తెలుసుకోలేక పోట్లాట పెట్టుకొని ఫైల్యూర్ వైపు అడుగులు వేస్తారు. కలసి సాధించవలసినది మరిచిపోతారు.

# ఫైల్యూర్ డిజైన్

ప్రేమ్ ఒక కంట్రాక్టింగ్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. తెలివైనవాడే కాని బడుద్దాయి. భార్య సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగి. ప్రేమ్‌కి కంపెనీ 6 నెలలు నోటీస్ ఇచ్చింది. ఈ విషయం ఇంట్లో చెప్పలేదు. సడెన్‌గా ఉద్యోగం పోయిందని ప్రకటించి ఇంట్లో కూచోసాగేడు. తెలివైన వాడు కాబట్టి చాలా ఉద్యోగాల ఇంటర్వ్యూలకు వెళ్లేడు. కాని ఒక్కటీ రాలేదు. ఆలోచిస్తే శని వుందని తేలింది. శని పూజలు చేసేరు. బాలకృష్ణలా తావీజులు కట్టించారు. ఏవీ పని చేయలేదు. ఇలా కాదని వాస్తు ప్రకారం ఇంట్లో గోడలు కత్తిరించి, వాస్తు సరి చేసేరు. అయినా ఉద్యోగం రాలేదు. మొత్తానికి 10 లక్షల ఖర్చు అయ్యింది. ప్రేమ్‌కి మొదట ఉద్యోగం పోగానే అతని జాతకం నేను చెప్పేను. ఇంట్లో కూర్చుంటాడని, ఏపనికి వెళ్లడని. అలాగే జరిగింది. కాని సొసైటీని నమ్మించడానికి 10 లక్షలు, రెండు సంవత్సరాలు, చాలా హైరానా, ఖర్చు చెయ్యవలసి వచ్చింది. 10వ ఓవర్‌లో 123 స్కోర్ వద్ద విరాట్ కోహిలీ అవుటయ్యాడు ఇంకా 8 వికెట్లు, 10 ఓవర్లు, 51 రన్నులు మిగిలేయి. అందరూ సైకిల్ స్టాండ్‌లో లాగ వరుసగా పడిపోయారు. ఇది క్రికెట్ అని అందరూ సరి పుచ్చువచ్చు. కానీ మొదటి ఇన్నింగ్స్‌లో కీలక దశలో అశ్విన్‌కి బౌలింగ్ ఇవ్వలేదని కేప్టన్ కాకుండా, మిగిలిన ఆటగాళ్లు ఫీల్ అయ్యారు. అంతే అందరూ తమకు తెలియకుండా ఫైల్యూర్ డిజైన్ చేసేరు. ఓటమి చవి చూసేరు.

# ఫైల్యూర్ డిజైన్

ఇంట్లో ఓ పని చెప్పేరు. నాకు అది ఇష్టం లేదు. స్కూటర్ తీసి ఏడుస్తూ బయలు దేరేను. మూడు నాలుగు సార్లు ఏక్సిడెంట్ అవ్వవలసినది తప్పిపోయినది. నేను క్షేమంగా ఇంటికి వచ్చేను. దీనికి కారణం అవతలి వాళ్లు ఫెయిల్యూర్ డిజైన్ చేసుకోక పోవడమే. వారు కూడా ఏడుస్తూ ఇంట్లోంచి బయలుదేరి వుంటే, ఖచ్చితంగా ఏక్సిడెంట్ అయ్యి ఉండేది.

నేను గ్రూప్–1, గ్రూప్–4 ఉద్యోగాలు రెండింటికీ ఒకేసారి అప్లయి చేసేను. అప్పుడు ఏం జరుగుతుంది? ఖచ్చితంగా రెండు ఉద్యోగాలూ రావు. ఎందుకంటే ఇది ఫైల్యూర్ డిజైన్. అప్లయ్ చేయక ముందే నా దగ్గర కారణాలు రెడీగా ఉన్నాయి. బ్యాంక్ క్లర్క్‌కి అప్లయి చేసి ఆఫీసర్ కోచింగ్ తీసుకునేవారు ఈ బాపతే.

కొందరు పెద్దవారు 'నాలాగ జీవితంలో పైకి రారా' అని అంటారు. ఆయన గుమస్తాగా జాయిన్ అయ్యి ప్రమోషన్ల మీద డిప్యూటీ కలెక్టర్ అయ్యి. తాను సాధించేనని చెబుతుంటాడు. 'ఏజ్ బార్ అయిపోతే ప్రమోషన్‌లు అవే వస్తాయి' (పోకిరి సినిమా) అన్నమాట మరచిపోయాడన్న మాట. ఇదొక ఫైల్యూర్. దాన్నే సక్సెస్‌గా వర్ణిస్తుంటాడు. మేం చూడు జీవితంలో ఎదగలేదా అని వేదాంతం వల్లిస్తాడు.

ఆదర్శ్ ఒక ఇంటర్ విద్యార్థి, ఐ.ఐ.టి. ట్రై చేసేడు. కాని ఇంజనీరింగ్ ర్యాంక్ కొద్దిలో తప్పిపోయింది. చచ్చినట్లు బిఎస్సీ చదువేడు. బ్యాంక్ ఉద్యోగాలు ట్రైచేసి అవి కూడా కొద్దిలో

తప్పిపోయాయి. అప్పుడు బిఈడి చేసేడు. పనికి మాలిన పరీక్ష (?) ఒకటి గవర్నమెంట్ పెడితే అందులో సెకెండ్ లిస్ట్‌లో ఆదర్శ్ టీచింగ్‌లో జాయిన్ అయ్యాడు. మిగిలిన టీచర్లు ఫైల్యూర్‌తో ఆ ఉద్యోగంలోనే రిలాక్స్ అవుతుంటే, ఆదర్శ్ పోటీ పరీక్షల అలవాటు వలన డి.ఇ.ఒ. అయిపోయాడు. ఇంజనీరింగ్ టైంలో ఫైల్యూర్‌కి ప్లాన్ చేసి, తరువాత తాను డి.ఇ.ఒ. అయ్యాక దాన్నే సక్సెస్ అని నమ్మబలుకుతాడు. తనకు టీచింగ్ అంటే ఇష్టమని, ఒక్క వెధవా సరిగ్గా చదవటం లేదని, ఒక్క టీచరుకీ చిత్తశుద్ధి లేదని – ఇలా ఉంటాయి. ఆదర్శ్ మాటలు. దీన్ని ఏమంటారు? Failure to plan. And coin it as a success.

మీరు ఒక్కసారి చుట్టూ జూమ్ అవుట్ (zoom out) చేసి చూడండి. వాళ్ళు ఎలా తమ ఫెల్యూర్లను ప్లాన్ చేసుకుంటున్నారో మనకి కనపడుతూ ఉంటుంది. రిటైరవ్వగానే హాస్పటల్స్ చుట్టూ పరిగెడుతుంటారు. జాగాలు కొని జీవితాన్ని సంతృప్తిగా బ్రతికేస్తుంటారు. ఏది ఏమైనప్పటికీ, చివరగా నేను చెప్పేది, ఫైల్యూర్ డిజైన్ వల్లే మనం హాస్పటల్స్, డాక్టర్ల చుట్టూ తిరుగుతున్నాం. నాకేమైనా సరదానా? ఈ వ్యాది వలన 'ఇలా అయ్యాను కానీ.....' ఇలా అంటున్న మనందరము ఫెయిల్ అవుతున్నట్టే నా లెక్క !

ఈ పుస్తకంలో ఇప్పటి వరకు నేను చెప్పేది మీకు హాస్యాస్పదంగా కనిపించవచ్చు. మన చుట్టూ కొన్ని వేల మది పనిలేనివాళ్ళు 'లేనిపని' కల్పించుకొని పోటీపడుతుంటారు. ఆంధ్ర తెలంగాణ ఉద్యమం చూడండి. ఎలాగూ సెపరేట్ అవ్వదని ఆంధ్రావాళ్ళు ఉదాసీనంగా

ఉన్నారు. తెలంగాణలో పని లేని వాళ్ళు రాజకీయ నాయకుల వెనుక చేరి తెలంగాణ కావాలి అని అరిచేరు. వారి ఉద్దేశం తెలంగాణ ఎలాగూ రాదనీ, వొచ్చినా అక్కరలేదని. కాని ఫలితం మీద అధికారం లేకపోవడం వలన తెలంగాణ అనుకోకుండా వచ్చేసింది. వచ్చిన దాన్ని సక్సెస్‌గా ప్రకటించుకున్నారు. పనిలేని వాళ్ళు ఫైల్యూర్ కోసం పరిగెట్టేరు. ఫలితాన్ని (తెలంగాణాన్ని) సక్సెస్‌గా చూపెడు తున్నారు. తెలంగాణా అవతరించాక వారు బావుకున్న దేమైనా ఉన్నదా చెప్పండి?

అలాగే సింగపూర్ పేరుతో అమరావతి ఒక ఫైల్యూర్ డిజైన్. దీన్ని మొదలు పెట్టినప్పుడే నేను గ్రహించాను. అమరావతి ఓ 10-15 ఏళ్ళ ప్రణాళిక అని. ఆ పేరుతో పవర్‌లోకి రావచ్చు కదా! అసలు దేశానికి కేపిటల్ ఎందుకు? ఏ తాడేపల్లి గూడెంలో సమావేశాలు చేసుకోక. చంద్రన్న పేరుతో చేస్తున్న చాలా పనులు ఫైల్యూర్‌కి దారి తీస్తాయి. వేచి చూడండి (జనవరి, 2019).

accident కి, failure designed accident కి తేడా ఏమిటి? మీరు బైక్ డ్రైవ్ చేస్తున్నారు. కొత్త టైరు పంక్చర్ అయ్యింది. మీరు అజాగ్రత్తగా కూడా డ్రయివ్ చెయ్యలేదు. దీనిని ఏక్సిడెంట్ అంటారు. మీ టైర్లు అరిగిపోయాయి. కొత్తవి మారుద్దాం అని అనుకుంటున్నారు. డబ్బులు ఉన్నప్పుడు టైర్లు గుర్తుకు రావు. గుర్తు వచ్చినప్పుడు డబ్బులు ఉండవు. దీనికి కారణం (Important but not urgent) అనే పనిని గుర్తించలేకపోవడమే! ఓ పరీక్షకు మీరు సరిగ్గా చదువు లేదు. పరీక్షలు అన్నీ అయిపోయాక కొత్త టైర్లు మార్పించుకుందాం అని

అనుకుంటారు. సరిగ్గా ఆఖరి పరీక్షకు వెళ్తున్నప్పుడు టైర్లు పంక్చర్ అయ్యి, ఏక్సిడెంట్‌కు మైండ్ డిజైన్ చేసింది. 'ఏక్సిడెంట్ వలన పరీక్ష పోయింది కాని' లాంటి సాకులు కోసం మైండ్ వెతుకుతోంది. ఇదే సంఘటన ఇలా కూడా జరుగవచ్చు. మీరు ఆలోచిస్తూ డ్రయివ్ చేస్తూ ఉంటారు. ఎదురుగా వొస్తున్న ఆటోను గుద్దేయవలసి వచ్చింది. కాని ఆటో డ్రయివర్‌కు ఫైల్యూర్ డిజైన్ లేనందున ఆటోను లాఘవంగా ఏక్సిడెంట్ నుండి తప్పించాడు. మీరు చాలా టెన్షన్ ఫీల్ అయ్యి పరీక్ష దొబ్బెట్టేరు.

ఒక వ్యక్తి మోటార్ సైకిల్ మీద తన భార్య, ఇద్దరు చంటి పిల్లలను వేసుకొని రాజోలు నుండి రాజమండ్రి వొస్తున్నప్పుడు లారి గుద్దుకొని మొత్తం ఫ్యామిలీ అంతా చనిపోయారు. ఇది నిజంగా జరిగిన సంఘటన. వెంటనే లారీ డ్రయివర్లు వెధవలు, తాగేసి డ్రయివ్ చేస్తారు అని అందరూ అంటారు. కానీ, నేనన్నాను "ఆ మోటార్ సైకిల్ వ్యక్తి 30 లక్షలు క్యాష్ తన జేబులో పెట్టుకొని అదే ఫ్యామిలీతో డ్రయివ్ చెయ్యవలసి వస్తే ఈ ఏక్సిడెంట్ జరగదు".

సినిమా జనంలా ఆలోచించవద్దు. అది ఫైల్యూర్‌కు పురిగొల్పుతుంది. సినిమాజనం అంటే అర్థం ఏమిటి. ఒక థియేటర్‌లో సినిమా నడుస్తోంది. సినిమా చూస్తున్న 300 మంది ఒకేలా ఆలోచిస్తుంటారు. వీడు హీరో మంచివాడు. అన్నీ మంచి పనులే చేస్తాడు. వీడు విలన్, వాడి దృష్టి, ప్రవర్తన, పనులూ అన్నీ వక్రాలే వీడు చెడ్డవాడు. ఇలా అందరూ మూసపోసినట్టు ఆలోచించడమే

సినిమాజనం ఆలోచనా విధానం. అంటే ప్రశ్నించకుండా యధాతదంగా విషయాన్ని అంగీకరించడమే!

అమెరికాలో ట్రంప్ గెలవడాన్ని Black Swan అని అంటారు. అది ఫైల్యూర్ డిజైన్ కాదు.

చదువు, మార్కులు ర్యాంకులు అని పిల్లల మీద తల్లిదండ్రులు వొత్తిడి తెస్తున్నారు. ఈ రకంగా తల్లిదండ్రుల మీద పెంచుకున్న కసి, కోపం –కొత్త కాపురాల్లో చూపిస్తున్నారు. కాపురాలను కాలరాసు కుంటున్నారు. దీనికి కారణం ఆత్మవిమర్శ సరిగ్గా లేకపోవడమే.

ఆఖరుగా ఓటమిని నిజాయితీగా ఒప్పుకోండి. మీకున్న ఉద్రేకాలను ఆత్మవిమర్శ సరిగ్గా చేసుకొని గమనించండి. అప్పుడు మనస్సు ఫైల్యూర్‌కి డిజైన్ చెయ్యదు. దానిపేరే సక్సెస్ అంటే. ఏదో సాధిస్తేనే సక్సెస్ అనుకుంటే అది ఫైల్యూర్ డిజైనే!

మన పురోగమన థింకింగ్ ఎప్పుడు ఆపుతాం? గెలిస్తే గొప్పా! ర్యాంకులు వొస్తే గొప్పా! బాగా సంపాదిస్తే గొప్ప! ఆస్తులు కూడబెడితే అబ్బో! జీవితం అంటేనే గెలుపు ఓటమిలకలయికని మిట్ట వేదాంతం చెబుతూనే – ఓడితే ఫ్లెక్సీలు తగల బెట్టడం, గెదలు పట్టుకొని తిరగడం. తమ ఆధిక్యత నిరూపించుకోవడానికి ఆవతలి వాళ్లని మట్టు పెట్టడమే ధ్యేయం – అలా చేయడమే ప్రేమను, అభిమానాన్ని చాటటం. ఇదేనా మనం గ్రహిస్తున్న అక్షరాస్యత? రెండు టీములు ఒక ఆట ఆడితే ఒక టీమ్ గెలవడం, రెండో టీమ్ ఓడడం సహజమైన విషయంగా మనం ఎందుకు తీసుకోలేకపోతున్నాం? ఒక వేళ మన టీమ్ గెలిస్తే, పాపం

ఆవతలి వాళ్ల టీమ్‌కి ఆ దేశంలో ఇలాంటి అగౌవరవాన్నే చూపెడతారు కదా. మరి వారి గతి ఏమిటి? ఇది తిరోగమన థింకింగ్ కాక మరేమిటి? ఓటమిని ఆస్వాదించలేని ఇటువంటి చిల్లర జనం, వెధవ పనులు చేస్తున్నప్పుడు, పోలీసులు నిర్ధాక్షణ్యంగా శిక్షించాలి. కనికరం లేకుండా 24 గంటలు జైల్లో పెట్టాలి. మరి మన పురుష పుంగవులు 40 దాటిన తరువాత నిత్యం సెక్స్‌లో ఫెయిల్ అవుతారే! మరి మొహం ఎక్కడ పెట్టుకుంటారో?

మనదీ ఒక బ్రతుకైనా, అబలను ఆక్రమించె కుక్కలవలె ఏవితల్లి నిరుడు కురిసిన హిమ సమూహముల వేదభూములు నింగికెగరడానికి? మన దేశ గొప్పతనం స్వకుచ మర్ధనా మాత్రమేనా? మన కల్చర్ అనే మాట కల్చివేస్తోంది. ఇప్పటికి మనం నపుంసకులమని నమ్మే స్థాయికి వచ్చాం. అసహ్యం వేస్తోంది – దేశాన్ని చూస్తుంటే.

ప్రక్క ఇంటిలో చెత్త పారేసినట్లు ఎంగిలి విస్తరిలా రైల్లోంచి, చెరిచిన బాలికను విసిరేస్తారు. నిర్భయా ఘటన తరువాత ఇటువంటి ఘటన పరంపర సర్వసాధారణమైపోయాయి. దీనికి కారణం పనికి మాలిన ఎడ్యూకేషన్ ఇస్తున్న ప్రభుత్వానిది. బూజుపట్టిన సాంప్రదాయాలు వల్లె వేయడంతోనే గడిపేస్తున్న జనానిది. తల ఎత్తుకొని, హూందాతనంతో, గౌరవంగా బ్రతికే కల్చర్ రావాలి. స్వశక్తిపై నమ్మకం కలిగించే విద్య రావాలి. అర్హత లేక పోయినా దేవుడికి దక్షిణ వేసి ఛాన్స్ కొట్టేద్దాం అని ప్రార్థించే జనం ఉన్నంతకాలం, ఇటువంటి దేశాన్నే చూడాలి. దయచేసి క్రిమినల్స్‌ని శిక్షించడంలో ఇది అంతమౌతుందని పలాయాన వాదంతో ఆలోచించవొద్దు.

## లావు తగ్గడం

చాలామంది బొజ్జ తగ్గడానికి, బరువు తగ్గడానికి ఫైల్యూర్ డిజైన్ చేసుకుంటారు. మీరు ఎలిమెంటరీ స్కూల్‌లో ఉన్నప్పుడు ఓ టీచర్ అంటే మహా ఇష్టం. అలాగే మీ మావయ్య అంటే కూడా మీకు ఇష్టం. కానీ విరిద్దరికి పెద్ద బొజ్జ ఉన్నాది. మీకు తెలియకుండా మీకు ఆ వయస్సు వచ్చేసరికి బొజ్జ వచ్చేస్తుంది. అంటే మీరు బొజ్జను ప్రేమిస్తున్నారన్నమాట. ఆవిషయం మీకు కూడా తెలియదు. సంఘం నియమించిన గోల్ కోసం, అంటే బొజ్జ లేకుండా ఉండటం కోసం మీరు ప్రయత్నిస్తూ ఉంటారు. మీరు ఎంత తలక్రిందులుగా తపస్సు చేసినా బొజ్జ తగ్గదు మహా అయితే ఓ ఇంచి తగ్గుతుంది. మీ శ్రమ, టైం, డబ్బు అన్ని దండగే. ఇది ఒక ఫైల్యూర్ డిజైన్. చుట్టూ ఉన్న వారి మెప్పుకోసం 'బొజ్జ తగ్గించుకోవడం అనే ప్రయత్నం శ్రమ తెలియకుండా విక్రమార్కుడిలాగ చేస్తూ ఉంటారు. (అలాగే బరువు తగ్గడం). మీ Neighbourhood ~~[illegible]~~లో నున్నస ఒక్క వ్యక్తిని చూపెట్టండి. బరువుతగ్గేడని, బొజ్జ తగ్గిందని. ఒకవేళ ఎవరికైనా తగ్గినా, ఓ ఆరునెలల్లో మళ్ళీ వచ్చేస్తుంది. కారణం ఫైల్యూర్ డిజైన్. చిన్న ఏక్సిడెంట్ అయ్యింది. పక్కమీద ఓ నెల రోజులు ఉన్నాను అందుకనే మళ్ళీ బొజ్జ వచ్చింది. ఇదీ రీజను, హృతిక్, ఐశ్వర్య, జూనియర్ ఎన్టీయార్, సునీల్ వీళ్ళకి ఉన్న మోటివేషన్,

పాపులారిటీ వల్ల చచ్చినట్లు బరువు తగ్గించుకుంటున్నారు. మీకు ఓ 5 కోట్లు ఇస్తే ఓ నెల రోజుల్లో బొజ్జా, బరువు రెండూ ఇట్టే తగ్గించుకుంటారు.

నిరుద్యోగంతో కొట్టుకుంటున్న యువత - డబ్బు ఉత్పత్తి చేయలేక సింపథీ కోసం నిరుద్యోగ భృతి తీసుకుంటున్నారు. వారు సక్సెస్‌ఫుల్‌గా ఫైల్యూర్ డిజైన్ చేసుకొని ఉపాది సంపాదించలేక పోతున్నారు. ఎంతసేపూ 'సర్వీస్ సెక్టార్'లోనే ఉపాదికోసం ప్రయత్నిస్తున్నారు. 'ప్రొడక్షన్ సెక్టార్' లోకి అడుగిడితే త్వరగా ఉపాది దొరుకుతుందన్న జ్ఞానం కూడా అలవర్చు కోవడం లేదు. ఇదీ ఫైల్యూర్ డిజైన్ కాక మరేమిటి?

**ప్రతీ వాడూ ఇంజనీరింగ్ చదవడం కూడా ఓ ఫైల్యూర్ డిజైన్. కాస్త డబ్బు ఆడగానే జాగాలు, అపార్ట్‌మెంట్‌లు కొనడం కూడా ఫైల్యూర్ కు దారి తీస్తుంది.**

ఆత్మ విమర్శ కరెక్టుగా చేసుకొని ఆత్మానందం పొందండి.







| | | |
|---|---|---|
| Name | : | Ravi Kishore Mallapragada |
| E-Mail | : | ravikishorem@yahoo.com |
| Whatsapp | : | +966501446104 |
| Qualification | : | Ph.D. Mathematics |
| Working | : | Asst. Professor, Yanbu Industrial College, Saudi Arabia |
| Interests | : | Psychology, Movies, Music, Travel |
| Previous Books | : | 1. Is job injurious to Wealth? (Telugu) |
| | | 2. Gireesam Master (Telugu) |
| | | 3. Money Management (Telugu) |
| Living at | : | Visakhapatnam |
| Genre | : | Personality Development |